# జనవరి 30 విడుదల





పద్మశ్రీ పిక్చర్స్

# అందరూ బాగుండాలి

దర్శకత్వం సి పుల్లయ్య  నిర్మాత వి వెంకటేశ్వర్లు





# ఫిబ్రవరి 1976

పవిత్ర మాసపత్రిక    సంపుటి 14    సంచిక 1

## విషయ సూచిక



పద్మాలయా ఆర్ట్ పిక్చర్స్ పాడిపంటలు లో కృష్ణ

సంస్థాపకులు    మేనేజింగ్ ఎడిటర్

శ్రీ శే వి వి రాఘవయ్య    శ్రీమతి వి లీలావతి రాఘవయ్య

జ్యోతి 40/1 మూసా సేట్ స్ట్రీట్ టి నగర్ మద్రాసు-600017

ఫోన్ 440548 సంవత్సర చందా (ప్రత్యేక సంచికతో) రు 42/-

# తొలిమాట

తొలిసారిగా తెలుగు కార్టూనిస్టులు ఒకచోట సమావేశమై సభ జరుపు కోవడమూ తెలుగు కార్టూన్‌ను మరింత ప్రతిభావంతంగా మలచేందుకు తీసుకోవలసిన చర్యల గురించి చర్చించుకోవడమూ అభినందనీయమైన విషయం జనవరి 11 న ఖమ్మంలో జరిగిన యీ నవ్వించే గీతల కర్తల సమావేశం వివరాలు లోపల పేజీలలో చూడగలరు

*　　　*　　　*

ఈ సంచికలో ప్రారంభించిన శీర్షిక సామెతల కథలు పాఠకుల్ని ఆకర్షించగలదని విశ్వసిస్తున్నాము ఈ శీర్షికలో తెలుగు భాషకు ఎనలేని సౌందర్యాన్ని సమకూర్చిపెట్టిన కొన్ని సామెతల వెనుక గల ఆసక్తికరమైన కథలను నెలనెలా జ్యోతి పాఠకులకు వివరిస్తారు రచయిత యామిజాల పద్మనాభస్వామి

*　　　*　　　*

జ్యోతి నవలానుబంధంలో ప్రచురించబడుతున్న నవలలలో విషయ వైవిధ్యం పాఠకులు గమనించే ఉంటారు ఈ సంచికలో ప్రచురితమైన శరతల్పం నవల (దాశరధి రంగాచార్య రచన) పై పాఠక సమీక్షలు ప్రత్యేకంగా ఆహ్వానిస్తున్నాము

*　　　*　　　*

వచ్చే సంచికలో రసవత్తరమైన నవల నాలుగిళ్ళ లోగిలి (పవని నిర్మల ప్రభావతి రచన) నవలానుబంధంగా ప్రచురించబడుతోంది నాలు గిళ్ళు గల ఒక లోగిలి లోని నాలుగు కుటుంబాల తాలూకు వ్యక్తుల వ్యక్తిత్వాలూ బలహీనతలూ వారి మధ్యగల స్నేహ సంబంధాలూ అతి సహజంగా చిత్రిస్తూ మలచబడ్డదీ నవల

వె. సోమశేఖరరావు

**FREE!** ఉచితం!

# ఉన్నపాటునె రండి

పాపములో పడిపోయిన పాపి ప్రభు పాదములయొద్దకు వచ్చుటకు కొంత సిద్ధపాటు కావలెనని అందరూ తలంచుదురు తీర్థయాత్రలు పుణ్య నదులలో స్నానాదులు నోములు వ్రతాలు ఉపవాసాలు దానధర్మాలు ఎంతవరకు మానవుల పాపములను పరిహరింపగలవు? నిజం చెప్పాలంటే దైవ సన్నిధికి వచ్చుటకు ఇటువంటి సిద్ధబాటులేవీ అవసరం లేదు ఆయనకు కావలసినదంతా మనము అంతవరకూ జేసిన పాపములకు పశ్చాత్తాప పడుటయే వ్యాధిగ్రస్థుడు వైద్యుని అవసరం గుర్తించినట్లు పాపవ్యాధిగ్రస్థుడు కూడ తన అవసరం గుర్తించి ప్రభు పాదములను పట్టినప్పుడు ఆ ప్రభువు వాడి అపరాధములను క్షమించి వాడి పాపములను పరిహరించి వాడిని పరిశుద్ధునిగా మార్చగలడు

దేవుడు మానవుల పాపములను దైవకుమారుడైన క్రీస్తునందే క్షమించగలడు మానవులంతా గొర్రెలవలె త్రోవ తప్పి ప్రతివాడూ తన కిష్టమై త్రోవకు తొలిగియుండగా దేవుడు మానవులందరి దోషములను క్రీస్తునందు క్షమించినాడు నాకు విధింపబడిన శిక్షను మరొకరు భరించినట్లు నేను చేసిన తప్పులను మరొకరు తీర్చినట్లు యేసు నా పాపములకోసం ప్రాయశ్చిత్తముగా తన ప్రాణం శిలువ ప్రాను మీద సమర్పించాడు తమ పాపపు దుస్థితిని గుర్తించి పశ్చాత్తాపముతో విశ్వాసముతో తన యొద్దకువచ్చే ప్రతి పాపిని ఆ ప్రభు కృపతో క్షమించి వారిని పవిత్రులనుగా చేయును మీ రెటువంటి ఘోరపాపులైనను సరె ఉన్నపాటునే ప్రభు యొద్దకు రండి తన యొద్దకు వచ్చేవారిని ఆ ప్రభు ఎన్నడూ త్రోసివేయడు నశించిన వారిని వెదకి రక్షించుటకే క్రీస్తు ఈ లోకములో అవతరించాడు

—చదలవాడ చంద్రమతీదేవి

## ఉత్తరాలు

జ్యోతి ప్రచురిస్తున్న జై మంగళా' అద్భుతం తెలుగు భాషలోని యింపు సొంపులీ నవలలో చక్కగా అమిరాయి నిజంగా ఈ రెండు నెలల్లోనే మాతో ఎంతో చనువుగా కలిసిపోయింది మంగళ మాకు ఒక చక్కటి వ్యక్తిత్వాన్ని పరిచయం చేసిన శ్యామలారాణిగారికి అభినందనలు

—హేమంత ఖరగ్‌పూర్

జనవరి జ్యోతి నూత్న కాంతులను వెదజల్లింది ముఖ్యంగా నవల ను పారకులు బైండు చేసుకునే బాధను తొలగించడం ఆనందకరం

—ఎమ్ జి మూర్తి విశాఖపట్నం-8

క్రొత్త ఎపుడూ వింతగానే ఉంటుంది అందుకే మీరు ఈ నూతన సంవత్సరంలో

ప్రారంభించే క్రొత్త శీర్షికలకై ఎదురు చూస్తున్నాను జనవరి సంచికలో మినీ కథ ఛాలెంజ్ బాగుంది అత్తగారే కోడలి నుదుట కుంకుమ దిద్దగలిగితే విధవ రాలైన స్త్రీ నిస్సారమైన జీవితం గడిప వలసిన అవసరం ఉండదు అని సం చెకి లో తోటకూర ఆశాలతగారు వ్రాశారు సంఘంలో మార్పు రావాలనే వారి రచనకు మా థ్యాంక్స్ నా అభిమాన రచయిత మల్లాది వెంకట కృష్ణమూర్తి గారి రచనా శైలితో మమ్ములను ఆశ్చర్య చకితులను చేసిన కథ మూడు రాత్రులు అపుడే ముగిసిందా అన్పించింది

—ఎస్ రమేష్‌బాబు మద్రాసు-17

జనవరి నవలానుబంధంలో ప్రచురిం చిన తోటకూర ఆశాలత గారి సంఘం చెక్కిన శిల్పాలు పాఠకులను ముఖ్యంగా ఆడవారిని బాగా ఆకట్టుకుంటుం దనుటలో సందేహం లేదు ఇంతమంచి సబ్జెక్టు ను ఎన్నుకుని నవలగా మలచిన తీరు చాలా బాగుంది హైందవ సాంప్రదాయంలోని కట్టువాట్లను బాగా పరిశీలించి పరిశోధించి అందుగల లోటుపాట్లను సామాన్య పాఠ కులకు కూడా అర్థమయ్యేలా చాలా బాగా విశదీకరించారు ప్రతి సాంప్రదాయానికి వెనుక గల కథను వివరించి దానిపై అనుకూలంగానూ వ్యతిరేకంగానూ సం భాషణలు నడిపిన తీరు బాగుంది

మల్లాది వెంకట కృష్ణమూర్తిగారి మూడు రాత్రులు థ్రిల్లింగ్‌గా సాగి చివరకు ఊహించని క్లైమాక్సుతో ముగి యటం పాఠకులను కొంచెం నిరుత్సాహ

పరచవచ్చునేమో 'డింప్లీ అన్న పదానికి అర్థం చెప్పకుండానే తప్పించుకున్నారు రచయిత —నీలిమ భోపాల్

సంఘం చెక్కిన శిల్పాలు నవల పల్లె వాతావరణాన్ని ప్రతిబింబిస్తూ చాలా సహజంగా చిత్రించబడింది పెద్దవాళ్ళ మూఢాచారాలూ యువతరం కోరుకునే నూతన భావాలు—యీ రెండింటి మధ్యా నలిగి నశించిపోతున్న జీవితాల్ని చక్కగా మలిచారు యీ శిల్పాల్లో రచయిత్రి

—సిహెచ్ ఆర్ సుబ్రహ్మణ్యం
సికింద్రాబాదు

జనవరి నెల జ్యోతి కమ్మని కథలతో చక్కని నవలతో ముస్తాబై నన్నెంతో ఆనంద పరచింది తోటకూర ఆశాలత గారి సంఘం చెక్కిన శిల్పాలు నవల వాస్తవానికి ఎంతో దగ్గరగా ఉంది రచయిత్రిగారికి మా ధన్యవాదములు మినీ కథలు మమ్మల్నెంతో నవ్వించాయి

—నిమ్మగడ్డ శేషగిరిరావు భీమవరం

శోభన్ మంజుల ల ముఖచిత్రంతో వెలువడిన మా అభిమాన 'జ్యోతి అత్యంత రమణీయముగ ఉన్నది మాది రెడ్డి సులోచనగారి "మిస్టర్ సంపత్ ఎమ్ ఏ సీరియల్ వాస్తవిక ఘట్టాల వాహానిలా సాగిపోతోంది. ముచ్చటైన ప్రేమ కథ' బాగుంది

—మార్క్ రిజరెక్టర్ కాకినాడ

జ్యోతి నవలానుబంధం సంఘం చెక్కిన శిల్పాలు చదివాను చాలా బాగుంది ఎంతో ఉన్నతంగానూ గంభీరంగానూ ఉండి అక్కడక్కడా కంట తడిపెట్టించే విధంగా మలచి రూపొందించిన నవల సంఘం చెక్కిన శిల్పాలు నేడు సమాజంలో విధవరాలు అయిన స్త్రీ నిస్సారమయిన జీవితం గడపుతూ ఎ విధంగా క్రుంగిపోతుందీ ఈ నవల్లో మనం చూడ గలుగుతాం

విధవరాలు అయిన కోడలు నుదుట కుంకుమ దిద్ది ఆడపిల్ల తల్లిగా సాటి స్త్రీగా ఆమె మనోపరిస్థితి అర్థం చేసుకొన్న రాజు ఉదయార్క్ వీరి లాంటి విధవరాళ్లు అయిన స్త్రీలు నాలుగ్గోడల మధ్య క్రుంగవలసిన పరిస్థితి జరగదు

—కొంగర ఉమామహేశ్వరరావు
హేమలత తెనాలి ★



మార్చి సంచికలో పూర్తి నవల

## నాలుగిళ్ళలోగిలి

పవని నిర్మల ప్రభావతి రచన



# పొగగొట్టాల భుగభుగలు

పరిశ్రమలు అభ్యుదయపు రైలుకు గార్డు చూపిన పచ్చ జెండాలు. గిర్...ర్...ర్...ర్...ర్...ర్...ర్ మరచక్రాల ధ్వనులు వినడానికి కటువుగావున్నా అవి దేశ ప్రగతి వసంతంలో కోకిల కూజితాలు.

- ఆంధ్ర ప్రదేశ్ పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్
- రాష్ట్ర ఆర్థిక సహాయ సంస్థ
- చిన్న తరహా పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్
- ఆంధ్ర ప్రదేశ్ మైనింగ్ కార్పొరేషన్
- ఆంధ్ర ప్రదేశ్ పారిశ్రామిక ప్రాతిపదిక సన్నాహాల సంస్థ వంటి అనేక సంస్థలు తోడ్పడతాయి.

అచిరకాలంలోనే ఆంధ్రప్రదేశ్ మనదేశ పారిశ్రామిక అభివృద్ధి పటంలో ప్రముఖ స్థానం అలంకరిస్తుంది.

---

సమాచార, పౌరసంబంధ శాఖ, హైదరాబాదు.







యామిజాల పద్మనాభస్వామి

న్యాయాలు సంస్కృత వాఙ్మయానికి సౌందర్యాన్ని ఇనుమడింప చేసినట్టే సామెతలు తెలుగు వాఙ్మయానికి పుష్టిని కలిగిస్తున్నాయి. న్యాయం అంటే సంస్కృతము ననుసరించి సామాన్యంగా మనకర్థమయ్యే శాస్త్రం కాదు. లౌకిక జ్ఞానం కలిగించే అర్థం, అనుభవం కలగలుపుగా వుండే వాక్యం న్యాయమని యిక్కడ గ్రహించాలి. అలాటి న్యాయాలను పోలి సామెతలు వుంటాయి. సామెతల సహజ సౌందర్యం ముమ్ముందు వివరించే సందర్భములో చెప్తాను. ముందుగా వాటికి మూలసూత్రాల వంటి న్యాయాలు రెండు మూడు వివరిస్తాను,

సంస్కృతభాష ఒకప్పుడు మన దేశములో సర్వసామాన్యంగా చెలామణీ అవుతూ అధికారం చెలాయించిందని కథలూ గాథలూ చెప్తున్నాయి. ఎంత సత్యమో మరి మన ఆది కవి - అంటే నన్నయగారి కాలములో రాజమహేంద్రవరములో అంగళ్ళలో క్రయ విక్రయ సమయాలలో సంస్కృతం వ్యవహరించే వారట. బజారుకి వెళ్ళి మామిడిపళ్ల వెల ఎంత అని ఒక పండితుడు పండ్లమ్మే అమ్మాయిని అడిగాడట తెలుగులో. ఆ పిల్ల సంస్కృతములో సమాధాన మిచ్చిందట 'ఫలస్య ఏకస్య మూల్యం అణకం' (ఒక పండు వెల అణా) అని. ఇందులో కొంతయినా సత్యం ఉండకపోదని నా అభిప్రాయం. ఆ కాలములో ఇంత తెలుగు మీరలేదు. శిలా తామ్ర శాసనాలు కూడా రాజులు సంస్కృతములో వేయించినట్లు శాసన చరిత్ర చెబుతూంది. సంస్కృతం అంతటా ముఖ్యంగా తెలుగునాట బహుళ ప్రచారంలో ఉండేది అనే మాట మాత్రం సత్యం. నన్నయగారు తెనుగు చేసిన మహాభారతం రెండున్నర పర్వాలూ చూడండి. సంస్కృతం ఎక్కువ కనిపిస్తుంది. ప్రారంభములో దేవతాస్తుతి సంస్కృత పద్యములో చేశారాయన. అలాగే తెలుగు భాషకి వ్యాకరణం సంస్కృత భాషలోనే వ్రాశారు. ఆ పుస్తకం పేరు 'ఆంధ్ర శబ్ద చింతామణి' క్రమంగా తెలుగు విస్తరించి సంస్కృత స్థానాన్ని పొందింది. ఏమైనా తెలుగు వారి జీవిత వ్యవహారమంతా

సంస్కృతముతో పెనవేసుకుని ఉందంటే కాదనలేరు. దురదృష్టవశాత్తు కలికాల మహిమవల్ల సంస్కృత భాషకి కుంటి కాళ్ళయిపోయాయి. దానిని 'మృతభాష' అని కూడా అంటున్నారు కొందరు 'ప్రబుద్ధులు' శాంతం పాపమ్. ప్రతిహతమ మంగళమ్.

దివ్యసుందరమైన పలుకుబడి గల భాష సంస్కృతం. ఆ భాషతో విడని సంబంధం కలుపుకొని మన తెలుగు భాష ధ్వని గాంభీర్యాలు సంతరించుకొని భారతీయ భాషలలో 'మధురమైన భాష' అని పాశ్చాత్య పండితుల ప్రశంసలందుకున్నది. అలాటి సంస్కృత భాష మృత భాష అయితే దానితో సంబంధం ఉన్న భాషలేమయేట్టు? ఇంతగా ఎందుకు వ్రాయవలసి వచ్చిందంటే ఆ భాష మాధుర్యాన్నీ గౌరవాన్నీ, గాంభీర్యాన్నీ, గడుసుదనాన్నీ అలవరచుకున్న మన తెలుగుజాతి యీనాడు దాని సంబంధానికి విడాకులిచ్చి నేల విడిచి సాముచేస్తూన్నట్లయిందే అని నా మనోవ్యథ వెళ్ళగ్రక్కుకోడానికే. ఇదంతా అరణ్య రోదనమే అని తెలిసి కూడా వ్రాయడం నా చేదస్తం, అయినా తిరిగే కాలూ తిట్టేనోరూ తిన్నగా ఉండవని మన భాషలో ఉంది కదా! ఇక ప్రస్తుతానికి వస్తాను.

మన సామెతలకు సంస్కృతం వారి న్యాయాలు మూలసూత్రాలవంటివనిన్నీ వాటిని రెండు మూడు ముమ్ముందు వివరిస్తానన్నాను. వాటిలోని చమత్కారమే అనండి, తమాషా అనండి, గమ్మత్తు అనండి, గాంభీర్యం అనండి, ఏదయినా సరే! గ్రహించండి. 'చాలా బాగున్నదే' అని అననివారుండరు. అయితే దాని స్వారస్యం గ్రహించే మనస్సు ఉండాలి. అది లేకపోతే నేనేమి చెయ్యగలను?అలా గ్రహించే శక్తి దైవం యివ్వవలసిందని ప్రార్థిస్తున్నాను. దైవం అని ఒకడున్నాడా? ఎక్కడున్నాడు? ఎలా వుంటాడు? వాడికి యీ న్యాయాలూ సామెతలూ వచ్చునా? ఎవడి దగ్గర ఏ స్కూల్లో లేక ఏ కాలేజీలో చదువుకున్నాడు; నీ కెక్కడేనా కనిపించాడా? అని యీలాటి చొప్పదంటు ప్రశ్నలు వేసేవారికి ఒక్క నమస్కారం.

'ఘట్టకుటీ ప్రభాతన్యాయం'అని ఒకటి. దీనిలో చిన్న కథ ఉంది.

ఒక పల్లెటూరి బండివాడు బండినిండా సామాను వేసుకొని పొరుగూరి సంతకి బయలుదేరాడు. పల్లెటూళ్ళలో సామాన్యముగా రాత్రి సమయంలోనే బళ్ళ ప్రయాణము చేస్తారు. ఇప్పటికీ ఈ సంప్రదాయం ఉందనుకుంటాను. కొంతదూరం అయాక బళ్ళకి పన్ను వసూలు చెయ్యడం ఉంటుంది. అక్కడ ఒక అధికారి హోదాలో వ్యక్తి ఉంటాడు. ఆ పన్ను కట్టేచోట రెండు మూడు దారులు కలిసే కూడలి అయి ఉంటుంది. ఒక చిన్న పాక:ఆ పాకలో ఓ గుమాస్తా. వానికి ఒక సేవకుడు. పన్ను తీసుకుని రసీదు ఇస్తాడు. అది లేనిదే బండి కదలడానికి వీల్లేదు. బండి యజమాని ఎంత మోతుబరి అయినా సరే ఆ పన్ను కట్టవలసిందే. ఆ పన్ను తప్పించుకొనేందుకు కొందరు ఆ పాక అల్లంత దూరములో ఉండనగానే అడ్డదారిని బండి తోలుకొనిపోతారు. ఆ

అడ్డదారి సవ్యంగా ఉంటేసరి. లేకపోతే బండి పడిపోవడమో దారి దోపిడీగాళ్ళ బాధకి గురి అవడమో; కాక బండిలాగే పశువులను ఏ విషపు పురుగో పుట్టో కాటు వెయ్యడమో యిలాటి ఉపద్రవాలు కలగవచ్చు. ఇంతకీ చెల్లించవలసే పన్ను ఆ కాలంలో రెండణాలు. దానిని మిగుల్చుకోవాలని యీలాటి వికటంకపు పనులుచేసి బాధపడి దానికి ఎన్నోరెట్లు ధనం పోగొట్టుకోడం జరుగుతూ ఉంటుంది. సంతకి రాత్రులు బయలుదేరిన బండివాడు ప్రయాణము చేసి చేసి సుంకం చెల్లించవలసే ఘట్టం అల్లంత దూరములో ఉందనగా బండి ఆపాడు. గుడిసె దీపం వెలుగు గుడ్డిగా కనిపిస్తూంది, ఆ సుంకం చెల్లించకుండా దక్కించుకోవాలనే దుర్బుద్ధి పుట్టింది. సరాసరి ఆ గుడిసె దగ్గరకు వెళ్ళే రాచబాట తప్పించి అడ్డదారికి బండి తిప్పాడు. అది గుడిసెను దాటించి తీసుకు పోతుందని ఆశించి చడీచప్పుడూ కాకుండా బండి తోలుకుని వెళ్లాడు. అలా వెళ్ళగా వెళ్ళగా బల్లున తెల్లవారింది. హమ్మయ్య! పన్ను చెల్లించవలసే గుడిసె దాటిపోయామురాబాబూ! అని సంతోషంగా గుండెలు రాసుకుంటూ బండి తోలుతున్నాడు. అంతలో 'ఏయ్! ఆగు?' పన్ను చెల్లించకుండా ఎక్కడికలా తోలుతున్నావు' అని ఒక మనిషి బారెడు చేపాటి కర్ర బండికి అడ్డంగా పట్టుకొని నిలుచున్నాడు. బండివాడు తేరిపార చూశాడు. ఎదురుగా అదే గుడిసె. దానిలో ఉండే సేవకుడు ముందు ఉన్నవాడు. తప్పించుకోవాలని అర్ధరాత్రంతా అడ్డమైన దారీ తిరిగి చివరకు ఆ గుడెసె దగ్గరకే వచ్చాడు. దిక్కులతో పాటు వాడి మొగం కూడా



వృధా అయింది అనుకున్నాడు. కిక్కూ మిక్కూ అనక సుంకం చెల్లించి వంక దండంపెట్టి వెళ్ళిపోయాడు. ఇదీ 'ఘట్టకుటీ ప్రభాత న్యాయం' అంటే. చూశారా ఎంత చమత్కారంగానూ, నీతిబోధకంగానూ ఉన్నదో!

"ఘట్ట" అంటే ప్రధాన స్థలం.

"కుటి" అంటే అక్కడి గుడిసె,

"ప్రభాతం" అంటే ఉదయకాలం.

ఘట్టకుటిని తప్పించుకోవాలని రాత్రంతా పడరాని పాట్లుపడి అడ్డమైన దార్లూ త్రొక్కి తెల్లవారేసరికి ఆ గుడిసె దగ్గరకే రావడం-"ఘట్టకుటీ ప్రభాతం." పొడుపు కథలాగున్నాదికదా యీ వాక్యం.

జీవితంలో ప్రదానంగా చెయ్యవలసే పని ఒకానొకప్పుడు తటస్థిస్తే అది 'నేను చెయ్యను' అని మంకుపట్టుపట్టి దానిని తప్పించుకోడానికి ఏవేవో పనులు చేసి చివరకు చెయ్యవలసే దానినే చెయ్యవలసి వస్తుంది. దానికి పైన వివరించిన




# నవ్వించే
# గ్రూపుగా గీతాకారులు

"అందరికీ సంఘా లున్నాయి సమావేశా లున్నాయి. సభ లున్నాయి. కార్టూనిస్టులకు లేవు. పెడదామని ఆశ. పెట్టివలసిందే ఆ ఆవశ్యకత నిజంగా వుంది పెద్ద యెత్తున వ్యంగ్య చిత్ర కళా ప్రదర్శనం జరగాలి. అందుకే "తెలుగు కార్టూనిస్టులారా ఏకంకండి" అని స్లోగన్ రాద్దామనుకుంటున్నాను (నవ్వకండయ్యా బాబూ)"—అని యువభారతి ప్రచురించిన వ్యాస సంకలనం 'మహతి'లో మూడేళ్ళక్రితం 'తెలుగు పత్రికలలో కార్టూనులు — జోకులు' అన్న వ్యాసం ముగింపులో బాధగా, ఆశగా వ్రాశారు శ్రీ సుధామ. అది ఒక్క 'సుధామ' తపనే కాదు. తెలుగుతనం తమలోనే కాకుండా తమ కార్టూనుల్లోనూ పెంచుకున్న తెలుగు కార్టూనిస్టుల కల తపస్సు.

ఆ తపస్సు ఫలించి, కల నిజమై ఖమ్మంలో జనవరి 11న 'ఖమ్మం కళా పరిషత్'వారి సహకారంతో కారూనిసుల సమావేశం ఏర్పాటు చేయబడింది తెలుగు కార్టూనిస్టు లెంతోమంది ఎంతో ఉత్సాహంగా పాల్గొన్నారు. కాని ఎక్కడెక్కడి వాళ్ళ నందర్నీ అక్కడ కలపడానికి నడుం కట్టిన వాళ్ళ కష్టనష్టాలు అంతా యింతా కావు. ముఖ్యంగా శంకు, బాబు, చంద్ర, సత్యమూర్తి, రామకృష్ణలు అభినందనీయులు.

ఆ సమావేశానికి ప్రేక్షకులుగా వచ్చిన పురప్రజల సంఖ్య 1500 పైగా వుంటుంది. సభ ప్రారంభం కావడానికి కాస్త ఆలస్యమైనా ఎంతో ఉత్సాహాన్ని చూపిస్తూ ఓపిగ్గా వున్న వాళ్ళని చూచిన కార్టూనిస్టులకి ఎంతో నమ్మకం తమమీద, ఎంతో అభిమానం తమ కళమీద.

సభకు ఆంధ్ర సచిత్ర వారపత్రిక సహాయ సంపాదకుడు శ్రీ వీరాజీ అధ్యక్షత వహించారు ప్రఖ్యాత చలనచిత్ర దర్శకుడు శ్రీ దాసరి నారాయణరావు, సినీనటి కుమారి విజయలలిత హాజ

రయ్యారు.

శ్రీ వీ రా జీ తమ అధ్యక్షోపన్యా సంలో మాట్లాడుతూ మొదట—కార్టూనుకూ-జోకుకూ ఉన్న భేదాన్ని వివరంగా తెలిపారు. అసలు కార్టూనిస్టంటే విదూషకుడు కాడనీ, గీతలను సాధనంగా గ్రహించి, హాస్యాన్ని మిళితం చేసి, విమర్శనాత్మక దృక్కోణంలో, కొంటెతనంలో లోకాన్ని చూచి ఉపయోగవంతంగా, ఆరోగ్యకరంగా చేసేవాడని చెప్పారు. తెలుగు కార్టూనిస్టుల్లో రాజకీయ కార్టూనిస్టులు ఎక్కువమంది లేకపోడానికి కారణం మన మంచి కార్టూనిస్టు లందరూ 'అన్‌కన్టామినేటెడ్ ఎంగ్ మెన్' కావడమే నన్నారు. శ్రీ తలిసెట్టి రామారావు గారినుండి యీదాకా, యిప్పుడూ, ఇంకా కార్టూనిస్టులకు పత్రికలు ఎంతో ఉత్సాహాన్ని కలిగిస్తున్నాయనీ, ప్రోత్సాహాన్నిస్తున్నాయనీ - ఉత్సాహంతో పెరుగుతున్న, పుడుతున్న కార్టూనిస్టు లందరికి 'గుడ్ లక్' చెప్పారు.

తర్వాత శ్రీ దాసరి నారాయణరావు 'ప్రత్యేక సంచిక'ను విడుదల చేస్తూ తానూ కార్టూన్లు గీయడానికి ప్రారంభించి, మాటలు రాసే తాను గీతల్తో మాట్లాడించలేక మాటల్లోనే ఆపుకున్నట్టు అన్నారు. గీతల్తో మాట్లాడించి, మాట్లాడించిన గీతల్తో ఎంతోమంది కార్టూనిస్టులకు ప్రేరణను కల్గించిన బాపు ఈ నాడు కార్టూన్లు, సినిమాలు అనే రెండు రంగాల్ని ఒకటిగా కలిపా రన్నారు. గీతలతో మాట్లాడిస్తూ వుండిన బాపు తారల్తో మాట్లాడించడానికి సినిమా రంగంలో ప్రవేశించడానికి కారణమైన మన దేశపు కళాకారుల గుర్తింపును ఓ మారు గుర్తు చేశారు.

కార్టూనిస్టుల ప్రత్యేక సంచిక ఎంతో ముచ్చటగా వెలువడింది-సంపాదకవర్గమైన సత్యమూర్తి, చంద్ర, బాబు, రామకృష్ణ, శంకు గార్లను ఎంతో మెచ్చుకోవాలి.

సమావేశం చివర శ్రీ వీరాజీ కార్టూనిస్టుల్నందర్నీ వేదికమీద అర్థ్వంగా, ఆకర్షణీయంగా పరిచయం చేశారు. ఒక్కో కార్టూనిస్టూ పరిచయం కాబడుతున్నపుడు విన్పించిన కరతాళ ధ్వనులు, ప్రేక్షకుల వుత్సాహానికీ, ఆ కార్టూనిస్టు మీది వారి అభిమానపు మోతాదుకు కొలబద్ద లన్పించాయి.

ఖమ్మం కళాపరిషత్తువారి కళాభిరుచికి వారు ఏర్పాటుచేసిన చిత్ర కళా ప్రదర్శనం కలికితురాయి. బాపు బొమ్మల్తోపాటు, ప్రఖ్యాత కార్టూనిస్టుల కార్టూన్లూ ప్రదర్శింప బడ్డాయి. ఆ ప్రదర్శనం చూచిన ప్రజల ఆనందం అవర్ణనీయం.

ఆనాటి సాయంకాలం 'కిన్నెర'లో కార్టూనిస్టు లందరూ ప్రత్యేకంగా కలుసుకొని భావి ఐక్యతకు కావలసిన పథకాలు వేసుకున్నారు

ఆ రాత్రి కళాపరిషత్తు వారు సభచేసి కార్టూనిస్టులను ప్రశంసిస్తూ సినీనటి కుమారివిజయలలిత ద్వారా 'మెమెంటో'లు బహూకరించి సత్కరించారు

సమావేశం అందంగా, హుందాగా ముగిసింది ఈ సమావేశపు సత్ఫలితాలను కార్టూనిస్టులు పొందే ప్రయత్నమే ముందు వుంది.

—కె. యస్. గోపాల్.

## జీవన వసంతం

సీరపాణి

శిశిర హిమయవనికలు శీర్ణమై జీర్ణమై
నవ మధూదయ స్వర్ణరాగ సంకీర్ణమై
గలిత పాదపశుష్క పత్ర సంరంభమై
లలిత నవ వల్లికా పల్లవారంభమై
అంతరించెను గతము ప్రళయ సంకేతమై
అవతరించెను నవత ప్రణవ సంగీతమై
కాలమొక నిత్య నూతన ఇంద్రజాలం
సుఖ దుఃఖ సంకలిత మణి ప్రవాళం
కాలమొక గంభీర జలధిః నిర్వేలం
రాత్రిందివాల రంగుల ప్రకృతి చేలం
కాలమొక సింధువు బ్రతుకొక్క బిందువు
కాలమొక మేరువు జీవితము రేణువు
ఈ ఇరుకు బ్రతుకులో ఇంత క్రౌర్యమ్మా!
మానత్వము మాపునంత ధైర్యమ్మా!
మనుషులను ప్రేమించు వాడెపో నరుడు
అది యెరుంగనివాడు అవని యమకింకరుడు
ఒక హిమాలయ భూధరోత్తుంగ శృంగమై
ఒక క్షీర సాగరోచ్చర దురు తరంగమై
సౌజన్య సౌహార్దముల నాట్య రంగమై
ప్రతి మనిషి జీవితము పరిఢవిల్లాలి
యుగయుగమ్ముల ధ్వాంత పటలి నశియింపగా
జడ జగతిలో నూత్న తేజమ్ము నింపగా
నైరాశ్యమును కూల్చి దారిద్ర్యమును డుల్చి
బ్రతుకులో చైతన్యమురళి రవళింపగా
అరుణ కిసలయ వసన మల్లికాదరహాసన
శుక రసన నవ వసంతము జగతి కరుదెంచె
జీవన రసాల శాఖాభ్యంతరము నుండి
అభ్యుదయ పుంస్కోకిలోద్గీతి నినదించె.

"వంశీ ఆర్ట్స్ హైదరాబాదు, తృతీయ వార్షికోత్సవం, ఘంటసాల 53-వ జన్మదినోత్సవం సందర్భంగా నిర్వహింపబడిన కవితల పోటీలో ప్రథమ బహుమతి గా 1161 పొందిన కవిత"

# నేను దేవిని కాను

"చూసేవురా అబ్బాయ్!" శారదమ్మ పేపరు చూస్తోనే కొడుకుని కేక వేసింది. భోజనం ముందు కూర్చున్న శ్యామా, మంచం మీద నడుం వాల్చి విశ్రాంతి తీసుకోబోతున్న నారాయణా ముందు గదిలోకి వచ్చేశారు.

పేపరు కొడుక్కి అందించింది. రంగాపురంలో "శ్రీదేవి" జన్మదినోత్స వాలట. పదేళ్ళుగా తన అపార మహిమతో వేలాది భక్తుల కోరికలన్నీ సిద్ధింప చేస్తూన్న "శ్రీదేవి" జన్మదిన సందేశం విని భక్తులంతా తమ తమ బాధలన్నీ నివృత్తి చేసుకుందుకు వీలుగా, 'శ్రీదేవి' జన్మదిన వేడుకలు మూడు రోజులబాటు అవిరామంగా జరుపుటకు "దేవీ నిలయం" కమిటీవారు నిర్ణయించారనీ, కనుక భక్తులంతా ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలనీ పేపర్లో వార్త. "మహిషాసుర మర్దని" అయిన దేవీ విగ్రహం ముందు, మోకరిల్లి కూర్చున్న "శ్రీదేవి" అమ్మవారి ఫొటో కూడా వేశారు. ఆమెవల్ల ఎవరెవరు ఏ యే ప్రయోజనాలు పొందారో, ఎందరెందరు వున్నత పదవులు పొందారో వాళ్ళ వాళ్ళ అనుభవాలు వాళ్ళ ఫోటోలతోసహా రెండు పేజీల నిండా వేసారు.

నారాయణ ఆశ్చర్యపోయేడు. తను ఇంచుమించు పాతికేళ్ళు వచ్చేదాకా రంగాపురంలోనే వున్నాడు. అప్పుడు ఇంత మహిమ కల "దేవి" ఎవరూ ఆ వూళ్ళో వుండేవారు కాదు. అయిదారు వందల ఇళ్ళు, ఏడెనిమిది వేల జనాభా వున్న రంగాపురంలో రెండు రామభజన మందిరాలు తప్ప, పెద్ద శిల్పాలున్న కోవెల కూడా లేదు. ఆ రోజుల్లో ఈ దేవే అక్కడ వుండి వుంటే "శారదమ్మ" అంత దొరకని జబ్బుకోసం, వున్న చిన్న తాటాకుల ఇల్లూ, అర ఎకరం మెట్టపొలం అమ్ముకుని, రాయవెల్లూరుకు పోవలసి వచ్చేది కాదు. తన కోసమే బ్రతికే కన్న తల్లి శారదమ్మను బ్రతికించుకోవటం కోసం ఎన్ని వూళ్ళో తిరిగాడు. విశాఖపట్నం, కాకినాడ, గుంటూరు మొదలయిన అన్ని ప్రధాన నగరాల్లోని జనరల్ హాస్పటళ్ళలోనూ రెండేసి నెల్లు వుండి వచ్చింది. ఇంక ఆఖరు ప్రయత్నంగా రాయవెల్లూరు ప్రయాణం పెట్టాడు నారాయణ.

"ఒరే అబ్బాయ్! నా జబ్బు తగ్గేది కాదురా! ఎందుకురా పోయే ప్రాణం కోసం, వున్న కాస్త మడిచెక్కా, జానెడు కొంపా అమ్ముకుపోవటం" అంటూ ఏడ్చింది శారదమ్మ. శారదమ్మ పుట్టి పెరి

గిన వూరూ, అత్తవారి వూరూ అదే! ఆమె పొరుగూరు కూడా ఎప్పుడూ దేనికీ వెళ్ళాల్సిన అవసరం వుండేది కాదు. పదహారేళ్ళకే వితంతువు అయినా, భర్త చిహ్నంగా నారాయణని పెంచుకుంటూ ఆ చిన్న తాటాకు ఇంట్లో క్లుప్తంగా మర్యాదగా జీవనం సాగించేది.

నారాయణ బి. ఎ. వరకు చదివి సైపూ షార్టుహేండూ ప్యాసయినాడు. ఉద్యోగ ప్రయత్నాలు చేస్తూవుండగానే శారదమ్మకి అంతులేని జబ్బు పట్టుకుంది. పుట్టి మెట్టిన వూరు వదిలి ఎన్ని వూళ్ళు తిరిగినా ఆమె జబ్బు తగ్గు మొహం పట్ట లేదు.

"అమ్మా! పుట్టినవాళ్ళు ఎప్పటికయినా పోవటం ఖాయం. అవకాశం వుండీ, డబ్బు మీద లుబ్ధత్వంతో నీకు సరయిన చికిత్స చేయించలేకపోతే, ఆ గుండె కోత నేను జీవితాంతం భరించలేను. ఇల్లూ పొలం జీవించటం కోసమే కదా! ఆ జీవితం లేకపోయేక, అవి ఎవళ్ళని ఉద్ధరిస్తాయి?" అన్నాడు నారాయణ.

తన కోసం తన ఆరోగ్యం కోసం. ఆఖరు పైసాకూడా ఖర్చు పెట్టటం కోసం ఏమాత్రం వెనుకంజ వేయని కొడుకుని చూసి తన జన్మ సార్థకమైందని తృప్తి పడింది శారదమ్మ. "వెళ్ళిపోతున్నావా, నారాయణా?" అంటూ వచ్చింది పన్నాలు గేళ్ళ సావిత్రి.

"ఇల్లూ వాకిలీ అమ్ముకుపోతున్నాం తల్లీ!" అంటూ బేలగా ఏడ్చింది ఆ పసి పిల్ల ముందు. శారదమ్మ ప్రౌఢత్వం కరిగి కిరుగుపోయింది. అనారోగ్యంవల శారదమ్మ బేలమనసుదయింది.

"నీకు నయమయితే, నారాయణ ఉద్యోగంచేసి బోలెడు పొలం కొంటాడు. పెద్ద ఇల్లు కట్టిస్తాడు. కదూ నారాయణా! దిగులు పడబోకు శారదమ్మా!" అంది సావిత్రి పెద్ద ఆరిందాలా. సావిత్రి బ్రాహ్మల పిల్ల. శారదమ్మ కాపు పడుచు! సావిత్రి తండ్రి దీక్షితులు. చుట్టుపక్కల వూళ్ళన్నీ తిరిగి తిథి వార నక్షత్రాలు చెప్పి ఆయవారం తెచ్చేవాడు. సావిత్రికి ఇద్దరన్నలూ, ఇద్దరు చెల్లెళ్ళూ వుండేవారు. సావిత్రి వాళ్ళు వూరి బయట ఏటి వొడ్డున వున్న పెద్ద తోటలో చిన్న పాక వేసుకొని వుండేవాళ్లు. ఆ తోట పొరుగూరులో వుండే ఒక పెద్ద ధనవంతుడిది. తోటకు కాపలాగా వుంటారని, ఈ పేదవాళ్ళకి ఉచితంగా పాక వేసుకుందుకు జాగా ఇచ్చారు. సావిత్రి పచ్చగా పొడుగ్గా, పచ్చి తాటాకు బొమ్మలాగుండేది. శారదమ్మ ఒక గేదెని మేపుతూండేది. సావిత్రి అప్పుడప్పుడు వచ్చి శారదమ్మ నడిగి మజ్జిగ తీసికెళుతూ వుండేది.

"అమ్మా! నేను సావిత్రిని పెళ్ళి చేసుకోనా?" అన్నాడు ఒకసారి నారాయణ. ముతక చీర కట్టుకున్న సావిత్రిని చూస్తే నారాయణకి దిగులుగా వుండేది. పొడుగాటి జుట్టు ఆ పిల్లది. చెంపకు చారెడేసి కళ్ళు, గుండ్రని అగరు బొట్టూ కళ్ళ నిండా కాటుకతో కళకళలాడుతూ కన్పించేది.

"అమ్మో! తప్పు, వాళ్ళు బ్రాహ్మర్లు!" అంది శారదమ్మ.

"నేను నిన్ను పెళ్ళి చేసుకుంటానంటే

మా అమ్మకు భయం. మీరు పెద్దకులం వాళ్ళట!" అన్నాడు నారాయణ సావిత్రితో.

"కూడు పెట్టి బ్రతికించలేని కుల గౌరవం ఎందుకు? నువ్వు చేసుకుంటా నంటే నా కిష్టమే!" అంది సావిత్రి. పద్నాలుగేళ్ళ సావిత్రి తన భావి జీవితాన్ని తన చేతుల్లో పెట్టటానికి సిద్ధపడితే ఇంకా జాలి వేసింది నారాయణకు. 'ఆకలి వయ సుకు మించిన పరిజ్ఞానం కలుగ చేస్తుంది కాబోలు! దేన్నయినా ధిక్కరించగలశక్తి ఆకలి జ్వాలనించే పుట్టుక వస్తుంది కాబోలు!' అనుకున్నాడు గ్రాడ్యుయేటు అయిన నారాయణ.

"నేనూ మీతో వచ్చేదా నారాయణా! శారదమ్మ హాస్పటల్లో వుంటే నేను కొంచెం వంటా వార్పూ చూస్తాను" అంది సావిత్రి.

"ఏమే అమ్మా! వెళ్తున్నది దూరా భారం! ఆడ సాయం వుంటే బాగుం డదూ!" అన్నాడు నారాయణ.



"సందేహం ఎందుకూ! మావాళ్ళేం అనుకోరు. ఒకళ్ళ భారం తగ్గినా తగ్గినట్లే!" అంది సావిత్రి, శారదమ్మ సందేహించటం చూసి.

శారదమ్మ కళ్ళ నీళ్లొచ్చేయి. "ఏనాటి పాపమో రోగంతో తీసుకుంటూంది. అభం శుభం తెలీని పిల్లని తీసుకుపోయి తమ కులంలో కలుపుకుంటే ఇంక ఆ పాపానికి నిష్కృతి వుంటుందా!" భయపడసాగింది శారదమ్మ.

"వద్దు తల్లీ! వద్దు. అక్కడ నేనే మన్నా అయ్యానంటే, పసిపిల్లవు, చూడ లేవు" అంది జాలిగా. అయితే శారదమ్మ ఏమీ అవలేదు. డాక్టర్లే అద్భుతపడేలా కోలుకొంది. నారాయణ చిన్న చిన్న వుద్యోగాలు చేసి చేసి చివరికి నెలకు మూడు వందలు ఇచ్చే వుద్యోగంలో కుదురుకున్నాడు. తనలాగే వెనకా ముందూ ఎవరూ లేని శ్యామని పెళ్ళి చేసుకున్నాడు. శారదమ్మది తృప్త జీవనం కాదు. పసితనంలో భర్తని పోగొట్టుకుంది. నారాయణ చదువయ్యేసరికి ఆరోగ్యం పోగొట్టుకుంది. ఇప్పుడు మనుమలని ఆడించాలనే కోరిక తీవ్రమయింది. పెళ్ళయి పధ్నాలుగేళ్ళు, పదహారేళ్ళు గడుస్తున్నాయి. శ్యామకి పిల్లలు కలగలేదు. అదొక తీరని కొరతగా వృద్ధాప్యంలో మనుమల్ని ఆడించాలనే కోరిక శారదమ్మ గుండెల్లో సెలవేసి సలుపుతూ వుండేది. ఎన్నెన్నో మందులు, ఎన్నెన్నో వ్రతాలు, పూజలు, జపాలు చేసినా శ్యామని సంతానవతిగా చేయలేకపోయింది. ఈ ప్రకటన చూసేసరికి శారదమ్మలో ఆశ చిగురించింది.

"అరే! నాలుగు రోజులు సెలవు పెట్టి ఎళ్ళి వద్దాము. ఏమో ఏ పుట్టలో ఏ పాముంటుందో ఎవరు చూడొచ్చేరు?" అంది శారదమ్మ.

"అదే నాకూ అంతుపట్టటం లేదు. మనం ఆ వూరు వదిలి నిండా పదహారేళ్లు అయ్యింటుందేమో. ఈ దేవి ఎవరంటావు?" అన్నాడు నారాయణ.

"ఎవరయితేనేం! ఆర్తులఆర్తితీర్చేది. వాళ్ళు ఎవరయితేనేం? ఎవరని నిర్ణయించేదిరా! అని ఆ మహానుభావుడు త్యాగరాజే తికమకపడ్డాడు. మనమెంత?" అంది శారదమ్మ భక్తిగా.

"అంతా మీ చాదస్తం అత్తయ్యా! కూటి కోసం కోటి వేషాలు! ఈ దేవి కూడా అట్లాంటి బాపతే అయ్యుంటుంది" అంది శ్యామ.

"నీతో అదే వచ్చింది చిక్కు! మనసు పెట్టుకుని పూజలు చేయవు. చదువుకొన్న వాళ్ళు అంతా నీలానే వున్నారా?" అంది శారదమ్మ విసుగ్గా.

"నాకు నమ్మకం లేదనుకోండి. నాలాంటివాళ్ళకి నమ్మకం కలగాలంటే ఆ దేముడు ఏదో మహత్తు చూపించాలిగదా" అంది శ్యామ నవ్వుతూ.

"నీలాంటి వాళ్ళని ఆస్తికులని చేస్తే గాని దేముడికి గడవదా?" అన్నాడు నారాయణ.

"నా మాట విను శ్యామా! త్రికరణ శుద్ధిగా నమ్మితేనే ఏపూజచేసినా ఫలించేది. మనసు సహకరించకపోతే శారీరక రుగ్మతలు తగ్గించలేమంటారు ప్రముఖవైద్యులు కూడా!" అంది శారదమ్మ.

శ్యామ మాట్లాడలేదు. శారదమ్మ

టెలివిజన్ కొనిచూడు!




ఎంతో ఉత్సాహంగా ప్రయాణం ఏర్పా ట్లల్లో మునిగిపోయింది.

"ముగ్గురం ఎందుకమ్మా! మూడు వందలుదారి ఖర్చులయిపోతాయి" అన్నాడు నారాయణ.

"మీరిద్దరూ ఎల్లానూ వెళ్ళాలి కదా! ఇంక నే నొక్కర్తినీ ఇక్కడెందుకని!"

"మేమిద్దరం మటుకు ఎందుకు?"

"అదేమిట్రా? దంపతు లిద్దరూ వెళ్ళి దర్శనం చేసుకోవద్దూ!"

"అది కాదే! నువ్వెళ్ళు. నీకు మన వూరు చూడాలని వుండటం సహజం" అన్నాడు నారాయణ.

"నేను వక్కర్తినీ ఎందుకురా! ఏమో పుట్టి పెరిగిన వూరు. 'నా' అన్నవాళ్ల లేకపోయినా ఈ 'దేవి' మహిమవల్ల పుణ్యక్షేత్రంగా మారింది. ఒకసారి చూసి వస్తే ఏం పోయింది?" అంది శారదమ్మ.

నారాయణకీ ముందు అనవసరం ఖర్చు. ఎందుకనిపించినా పదహారేళ్ళకి తన కుగ్రామంలో ఎన్ని మార్పులు వొచ్చాయో చూడాలనిపించింది. ముగ్గురూ వారం రోజులు అటుకేసి దగ్గర బంధువులందర్నీ చూసిరావొచ్చు ననుకుంటూ బయలు దేరారు.

* * *

రంగాపురం వూరంతా పచ్చని పందిళ్ళు వేశారు. ప్రతీ ఇల్లూ. చివరికి తాటాకు ఇల్లయినా తెల్లగా సున్నం కొట్టించి శుభ్రంగా వుంది. ప్రతీ ఇంటికీ మామిడి ఆకుల తోరణాలు కట్టారు. వూరిలోని ప్రతీవాళ్ళ ఇల్లూ వచ్చేపోయే బంధువులతో ఇరుకుగా గలగల్లాడుతూ వుంది. "దేవీ నిలయం" వూరి చివర తోటలోనే వుంది. చక్కని పాలరాతి మందిరం ఆది! చుట్టూ అందమయిన క్రోటన్స్‌తో, రంగురంగుల

ఎరబూసన పూలతో వున్న చక్కని తోట ఎన్నో రకాల ఫలవృక్షాలు వున్న పెద్ద తోట. ఏటి వొడ్డున పొడుగూతా ఫర్లాంగు దూరం వ్యాపించి వుంది ఆ తోట. అక్కడక్కడా పొడవయిన టేకు చెట్లు! వాట్లని ఆశ్రయించుకొని వేలాది తలక్రిందుల పక్షులు "కీచ్ కీచ్"మంటూ చేసే రొద!

'దేవీనిలయం'కు వెళ్ళే దారి పొడుగునా టెంకాయలూ, హారతి కర్పూరం, అగరు వత్తులు, అరటిపళ్ళు పసుపు కుంకుమా. పూలదండలూ అమ్ముతున్న దుకాణాలు న్నాయి. ఒక వేపు అద్దాల త్రోపుడు బళ్ళల్లో రక రకాల తీపి, ఖారం, పిండి వంటలతోబాటు ఉదయాన్నే కాఫీ, టీ, ఇడ్లీ, దోసె, ఉప్మా మొదలయిన ఉదయంపు ఫలహారాలతో ఒక మొబైల్ హోటలు ఏర్పాటు చేసారు.

దారి పొడుగునా గోనె పట్టాలు పరుచుకుని కుంటీ, గుడ్డీ, మూగా, కుష్ఠు మొదలయిన వ్యాధులున్నవాళ్ళు కూడా కూర్చుని వచ్చేపోయేవాళ్ళకి చేతులడ్డంగా జాపుతూ "అమ్మా ధర్మం తల్లీ! గుడ్డివాణ్ని తల్లీ" "అమ్మా మీ కోరిక తీరతాది. జబ్బు ముండకి ఒక్క పైసా పడెయ్యి తల్లీ!" అంటూ దీనంగా అడుగుతున్నారు. దేవీ నిలయానికి వచ్చేపోయే భక్తులు చిన్న చిన్న సంచీలలో నూకలు పోసుకొని గోనె పట్టాల మీదకు గుప్పెడు గుప్పెడు విసురుకుంటూ పోతున్నారు. కొంతమంది పైసా నాణేలు విసురుతున్నారు. వాళ్ళని చూసి బిచ్చగాళ్ళు "మాకెయ్యండమ్మా, మాకెయ్యి తల్లీ నూగ్గింజలు" అంటూ పెద్ద గోలగా అరవడం మొదలు పెట్టారు.

శారదమ్మా, శ్యామా ఏటిలో స్నానాలు చేసి వొచ్చేరు. ఒక పళ్లెం నిండుకూ బియ్యం తెచ్చి, శారదమ్మ తలొక గుప్పెడూ వేసుకుంటూ వస్తోంది. శ్యామ ఒక రూపాయి పైసలుగా మార్చి, అవి వచ్చినంతవరకు తలొక పైసా వేసి ఆ పయిన వూరికే నడిచింది.

ప్రభాత వేళలో దేవస్తుతి మైకులో ఉచ్చైస్స్వరంతో విన్పించుతోంది. జనం త్రోసుకుంటూ ఒకళ్ళ నొకళ్ళు త్రొక్కుకుంటూ నడుస్తున్నారు. భక్తిని వెదజల్లే ఆ స్తోత్రగీతాలు వింటూంటే రోమాంచిత మయిపోయింది నారాయణ. జనం త్రోపిడికి ముఖ ద్వారం దగ్గరికి వచ్చి పడ్డాడు నారాయణ. శ్యామ బాగా వెనుక పడిపోయింది. లోపలికి వచ్చేడు. అది విశాలమైన స్థంభాలతో వున్న పెద్ద మండపం. స్తంభాలచుట్టూ రంగు రంగుల ఎలక్ట్రిక్ బల్బుల తోరణాలు కట్టారు. మంటపంలో అక్కడక్కడా పెద్ద పెద్ద గాజు బుడ్లు వ్రేలాడకట్టారు.

చక్కని చిన్న చలువరాతి అరుగుమీద మహిషాసురమర్దని అయిన దేవి బంగారు ప్రతిమ! ఎర్రని గులాబీలు, ముద్ద మందారాలు, పచ్చగా అరచేయి అంతగా విచ్చిన చామంతులతో ఆ నిలువెత్తు విగ్రహం అలంకరింపబడి వుంది. వెలుగుతూ ఆరుతూ వున్న విద్యుద్దీపమాలిక ఆ మండపానికి వింతశోభ నిస్తోంది. ఆ విగ్రహం ముందు చిన్న నాలుగు కోళ్ళ పీట మీద కూర్చొని అర్ధనిమీలితంగా వుంది శ్రీదేవి.

పొడుగాటి జుట్టుని విరబోసుకుంది. నుదుట ఎర్రగా యూపాయి కాసంత

కుంకుమ బొట్టు! కన్నుల కాంతి ముఖం! చారెడేసి కళ్ళకీ చింతాకంత వెడల్పున కాటుక! ఎత్తుగా నించున్న ముక్కుకి సన్నటి ముత్యాల నత్తు! గడ్డం మీద మూడు చుక్కలు పచ్చ బొట్టు! చేతులకి పగడాల రంగులో గోరింట. ఒక చేత జేగంట మ్రోగించుతూ, ఒక చేత హారతి యిస్తూంటే దేవీ విగ్రహంకన్న ఎక్కువ కళగా ఆ హారతి వెలుగులో దేవి ముఖం మెరిసిపోతుంది. పచ్చనిపట్టుచీరలో వున్న శ్రీదేవికేసి తదేకంగా చూస్తూ నిలబడి పోయేడు. భక్తులు ఆవేశంతో రపీ రపీ మంటూ లెంపలు వాయించుకుంటూ "దేవి" ముందు సాష్టాంగ పడుతున్నారు. కొంతమంది గంట మ్రోగించుతున్నారు. కొంతమంది తాము తెచ్చిన పళ్ళు పసుపు కుంకుమ అన్నీ దేవి ముందుంచుతున్నారు.

శ్రీదేవి. ఎవరివేపు చూడటంలేదు, ఆమె పక్కన ఒకతను నించున్నాడు. బరంపురం పొత్తు పంచె, నడుంకు ఎర్రని సిల్కు తువ్వాలు కట్టుకున్నాడు. నుదుట విభూతి రేఖల మధ్య చిన్న కుంకంబొట్టు! బక్కగా పొడుగ్గా, తెల్లగా వున్నాడు. భక్తులు తెచ్చిన పళ్ళు, ఫలహారాలు వేటి కవి విడదీసి, కొంచెం ఒక వారకిత్రోసి, కొంచెం వాళ్ళకి ప్రసాదంక్రింద ఇస్తున్నాడు. ఇదంతా ఎంతో వింతగా చూస్తూ నిలబడ్డాడు నారాయణ. ఎవళ్ళ తొందర వాళ్ళది! ఒక అరగంటకి శ్యామ వచ్చింది. పళ్ళూ, పూలూ వున్న పళ్ళెం శ్రీదేవి ముందుంచి సాష్టాంగపడి లేచి భక్తి పూర్వకంగా లెంపలు వేసుకుంది.

"అల్లా నిలబడ్డారేమిటి!" అన్న భార్య మాటకు నారాయణ ఉలిక్కిపడ్డాడు.

టెలివిజన్ కొనిచూడు!




"వచ్చేవా నీ కోసమే నించున్నాను." అన్నాడు. పక్కగా గుజగుజ మాటలు వినపట్టంతో శ్రీదేవి చూపు చెదిరింది. దేవి ప్రతిమమీంచి చూపు మళ్ళించుకుని వీళ్ళవేపు చూసింది. నారాయణ చూపు "శ్రీదేవి" చూపుతో చిక్కుపడింది. కలవరపడ్డాడు నారాయణ. శ్యామ ఇచ్చిన పళ్ళు పూలువున్న పళ్ళెరంమీద చేయి వేసింది శ్రీదేవి. దేవి విగ్రహం పాదాల ముందు రాసిలా వున్న పారిజాతాల్లోంచి గుప్పెడు పూలుతీసి శ్యామ దోసిట్లో వుంచింది. శ్రీదేవి ప్రక్కనున్నతను పళ్ళెరం తీసుకుని, పళ్ళూ పూలు కొన్ని తీసుకుని, కొన్ని పళ్ళెంలో వుంచేడు. దేవి స్వయంగా, శ్యామ పళ్ళెరం తాకటం చుట్టుప్రక్కలున్న భక్తులు చూసేరు. శ్రీదేవి. శ్యామని అనుగ్రహించిందని అందరూ, శ్యామనారాయణ దంపతులకు సాగిలబడి మ్రొక్కసాగారు. ఈ సంగతి ఎంతో వెనుకపడివున్న శారదమ్మకి ఎవరో చెప్పారు. ఆమె కళ్ళు జలపూరితాలయ్యాయి. ఆనందంతో శారదమ్మకి నోట మాటరాలేదు. జనం, నారాయణ దంపతులని నడవనీయటం లేదు. అరిచేతులు పరచి ఇవతలకి తీసుకువచ్చేరు.

"నీ కోరిక తప్పక తీరుతుందే తల్లీ!" అంటూ శ్యామని కౌగలించుకుంది శారదమ్మ.

"పూవులు ఇచ్చారు శ్రీదేవి. తప్పక కూతురు పుడుతుంది" అంది ఒక ముత్తయిదువ.

"ఏ పిల్ల అయితేనేం! ఏదో ఒక పిల్ల కలిగితే చాల్ను!" అంది శారదమ్మ. శ్యామకిదంతా ఏదో సిగ్గుగా వుంది. శారదమ్మ దూరపు బంధువుల ఇంట్లో దిగారు వాళ్ళు. శ్యామని ఒక్కపనైనా చేయనీయటం లేదు

వాళ్ళు. ఆమె దేవి అయినట్లుభక్తితో అడుగు లకు మడుగులు వొత్తుతున్నారు. నారాయ ణకీ అంతా ఏదో కలగా వుంది. ఏదో సందే హంతో మనస్సు కొట్టుకుపోతోంది.

ఇది నిజమేనా! నిజం కాకపోతే మరి చూస్తున్నదేమిటి! పదహారేళ్ళనాటి పేద బ్రాహ్మణపిల్ల ఒక పూట తింటే రెండు పూటలు పస్తులుండే సంసారం వాళ్ళది. ఇంతలో ఏ భగవంతుడూ ప్రత్యక్షం కాక పోతే ఇల్లా ఎల్లా మారగలదు? నిజంగా దేవీ సాక్షాత్కారం పొందే వుంటారు వాళ్ళు!

"శ్రీదేవి" జన్మదినోత్సవాలు ఎవ్వరూ వూహించలేనంత అత్యద్భుతంగా జరి గాయి. చాలామటుకు ఊరంతా ఖాళీ అయ్యింది. ఎందరెందరో మంత్రులు, కలక్టర్లు, పెద్దపెద్ద వ్యాపారస్థులు అందరూ వచ్చి "శ్రీదేవి"ని సందర్శించి, ఆమె దీవెనపొంది వెళ్ళారు. పేపర్లన్నీ ప్రత్యేక అనుబంధాలని ప్రచురించాయి. ఇంక తెల్లవారి నారాయణ వాళ్ళ ప్రయాణం. ఈ వారంరోజులూ నారాయణ దంపతులు, శారదమ్మ రెండుపూటలా 'దేవీ' భజనల్లో పాల్గొంటూనే వున్నారు. "శ్రీదేవి" నారా యణ చూపులతో తికమకపడ్తూనే వుంది. రాత్రి పదకొండు గంటలు దాటేదాకా 'దేవీ మంటపం'లో పురాణ కాలక్షేపం విని వచ్చారు. అత్తాకోడల్లు. నారాయణకి నిద్రపట్టలేదు. అర్ధరాత్రివేళ ఏదో ఆలో చించుకుంటూ ఏటి వొడ్డుకి వచ్చేడు. దూరంగా, వంటరిగా వున్న పారిజాతం మొక్కవద్ద ఎవరో తెల్లని చీరలో ముసుగు వేసుకుని నిలబడినట్లు ఆ మసక వెన్నెల్లో కన్పించింది నారాయణకి. అటుకేసి నడిచేడు. పారిజాతం చెట్టు విరబూసింది. వెనకాతల పొడుగాటి టేకు చెట్ల నీడలు, చారలు చారలుగా వెన్నెల జాడలు!

"ఎవరదీ?" అన్నాడు నారాయణ.

"నేనే నారాయణా!"

"మీరా!"

"ఆ మన్నింపెందుకు నారాయణా! నేను సావిత్రినే. ఇప్పుడు దేవిని కాను" నవ్వింది స్నిగ్ధంగా సావిత్రి.

"ఇల్లా వొచ్చేవేం?"

"ఈ వారంరోజులుగా రోజూ వస్తూనే వున్నాను. ఇవ్వాళ వొచ్చేవు నువ్వు!"

"అయితే?" సందేహంగా ఆగాడు నారాయణ.

"నీ కోసమే నారాయణా! నీతో మాట్లాడాలనే నా ఆరాటం ఆపుకోలేకనే! అయితే నిన్ను ఎల్లా కలుసుకోగలను! పూర్వంలా మనమిద్దరం గంటలకి గంటలు ఏటివొడ్డున సూర్యాస్తమయం చూస్తూ కబుర్లు చెప్పుకుంటూ కాలం గడప గలమా!"

"నన్ను మర్చిపోలేదా నువ్వు!" ఏదో సందేహం, బాధా గొంతులో.

"నువ్వు మర్చిపోయేవా నన్ను?"

"లేదనుకో! కాని "

"అంత సులభం కాదు నారాయణా. మనస్సుని జోకొట్టటం తాత్కాలికం. అది ఎప్పుడో ఒకప్పుడు లేచి మారాము పెడుతూనే వుంటుంది."

సావిత్రి మనస్సేమిటో నారాయణకి అర్ధం అయ్యింది. కొంచెం తల తిరిగి

నట్లయింది. తనలోతనే ఏదో నచ్చచెప్పు కున్నాడు.

"ఇదెలా సంభవమయింది!" గొణిగి నట్లుగా అడిగాడు.

"ఏది?"

"అదే! నీకు దేవీ సాక్షాత్కారం ఎల్లా కలిగింది! నాకు తెలుసున్నంతమటుకు మీ ఇంట్లో పెద్ద పూజలూ, పునస్కారాలూ చేసేవారు కాదుకదా!"

"కూర్చో నారాయణా! స్థిమితంగా చెబుతాను." ఇద్దరూ ఏటివొడ్డున ఇసుకలో కూర్చున్నారు. ఇసుక చేతినిండా తీసుకుని ఇంకో చేతిలోకి ధారగా పోస్తూ చెప్పింది సావిత్రి.

"నీకు మా సంసారం సంగతి తెలుసు కదూ! మా నాన్న ఆయివారంచేసి తెచ్చే దానితో ఆరుగురం తినాలి. మా అన్నలకి చదువులు రావు. పౌరోహిత్యాలు చేసే వారు. మా అమ్మ పెద్ద ఆరోగ్యవంతు రాలు కాదు. పౌరోహిత్యాలు లేనప్పుడు మా అన్నలు పొలం పనులకి, కూలికి వెళ్ళేవారు.

"అబ్బ! అబ్బ నాకారం వాపనోడివి! నీవు నారు కావిళ్ళేం మోస్తావు?" అంటూ కూలిపన్లుక్కూడా రానిచ్చేవారు కాదు. బస్సు దగ్గిరికి మూటలు మోయటానికివెళ్తే మా చిన్నన్నతో "బాపనోడివి నువ్వు కూడా మావోళ్ళన్నా వాళ్ళు చాలక, వొంతుకి వచ్చేవా! ఎల్లెల్లు? అంటూ తోటి కూలీ వాళ్ళు దెబ్బలాటకి దిగారట! పౌరోహిత్యాలు రోజూ వుండవు. మా నాన్న వారం పది రోజులు చుట్టుపక్కలున్న పల్లెటూళ్ళన్నీ తిరిగినా, నాలుగు కుంచాల బియ్యమయినా పోగయేవి కాదు. తిరిగి తిరిగి వచ్చి నీరసంతో అయిదారు రోజులు కదలలేక పోయేవారు. ఇల్లా చాలీ చాలని ఆకలి బ్రతుకులతో వుండగానే నేనూ, మా చెల్లాయి లిద్దరూ కూడా పెద్దవాళ్ళ మయ్యేము. ఒక రోజు నేను తోటలో చెట్లకి నీళ్ళు పెట్టున్నాను. అనుకోకుండా మా తోట యజమాని కారులో వొచ్చేడు. తోట అమ్మకం పెట్టున్నారుట. కొను క్కునే వాళ్ళకి తోట చూపించటానికి వొచ్చేరు. యజమానికీ, కూడా వొచ్చిన వాళ్ళకీ, కొబ్బరికాయలు కొట్టి నీళ్ళు ఇచ్చేడు మా పెద్దన్న. నన్ను చూసేడుట యజమాని. కళ్ళు చెదిరినట్లున్నాయి. పెద్ద ధనవంతుడు కదా పాపం?

"మీ పెద్ద చెల్లేనా ఆ పిల్ల! బాగా తయారయిందే! రేపు ఆదివారం, కారు పంపుతాను. మా వూరు పంపు! మీ కుటుం బానికి ఏ లోటూ వుండదు. నెలకి రెండు వందలు ఇస్తాను" అన్నాడుట మా అన్నతో.

ఆయనకి యాభయ్ ఏళ్ళు వుంటాయి. నా వయస్సు మనుమరాళ్లు వుండివుంటారు. మా అన్నయ్యకి పౌరుషం వచ్చింది తిండికి లేనివాళ్ళకి ఆత్మాభిమానం శీలం వుండక్కర్లేదు అనుకున్నాడేమో! ఆయన వెళ్ళాక మా పెద్దన్నయ్య నన్ను దగ్గర




తీసుకుని ఆయన అన్నమాట చెప్పాడు నాతో. అప్పటికి మా ఇంట్లో పొయ్యి రాజేసి మూడురోజులు అయ్యింది. ఏం చెయ్యాలో తోచలేదు. చిలకడదుంపలుంటే ఉడకబెట్టాను ఆ రోజు!

"పోనీ వెళ్తాలే అన్నయ్యా! ఆ వూరు!" అన్నాను బింకంగా. అయినా లోపల భయమే!

"అల్లా కాదుండు" అన్నాడు. ఇంట్లో వున్న చిన్న ఇత్తడి బిందె అమ్మేసి, చిన్న 'మహిషాసుర మర్దని' విగ్రహం ఒకటి కొనుక్కుని వచ్చేడు. మా అన్నయ్య సలహా మేరకు నేను ఏటివొడ్డున జుట్టు విరబోసుకుని నాలుగు రోజులు పాటు కూర్చుండిపోయేను. నన్నుచూసిన గొడ్ల కాపు కుర్రాళ్ళు వాళ్ళంతా వెళ్ళి వూళ్ళో వాళ్ళతో చెప్పారు. వూళ్ళో వాళ్ళు కొంత మంది నన్ను చూడటానికి రావటం మొదలుపెట్టారు. మా అమ్మ చెల్లాయిలూ కూడా వచ్చేరు. అందరూ చూస్తోవుండగా అమ్మ చెల్లెళ్లూ "నన్నింటికి రమ్మనమని" కన్నీళ్ళతో బ్రతిమలాడటం మొదలు పెట్టారు. నేను వెర్రికోపంతో గుడ్లెర్ర చేసాను. వంటిమీదున్న చీరని చింపేసుకున్నాను.

"వెర్రి పీనుగుల్లారా! నే నెవరనుకున్నారు! దేవినర్రా దేవిని! ఈ ఏటి ఇసుకలో నన్నణగద్రొక్కుర్రా! మీరు లోభక్రోధమోహామద మాత్సర్యాలతో కాలం వెళ్ళబుచ్చుతున్నారా! నన్ను పైకి తీయండి! నేను ఆ కన్నెపిల్ల మీద వున్నాను. ఆమె చెప్పినట్లు చేయండి! లేక

పోతే వూరు మాడి మసి అయిపోతుంది" అంటూ నోటికి వచ్చినట్లు తిట్టసాగాను. ఇంతలో చాకలాడు వేపమండను తెచ్చి విసరసాగాడు. ఇంకొకళ్ళెవరో కుండ మూకుడులో కణకణలాడే నిప్పులు తెచ్చి సాంబ్రాణి పొగ వేయసాగారు. వారం పదిరోజులుగా వుండీ లేక అన్నం సరిగ్గా తినటం లేదేమో నాకు అరవగా అరవగా, శోష వచ్చి, కుప్పలా కూలిపోయేను. అప్పుడు వాళ్ళంతా నా ముఖం మీద చన్నీళ్ళు చల్లి పాలూ పంచదారా కలిపి



నాకు పట్టించారు. నన్ను నెమ్మదిగా ఒక టేకుచెట్టు నీడను కూర్చోపెట్టారు. నేను నాలుగు రోజులుగా కూర్చున్న చోట మా చిన్నన్నయ్య, పెద్దన్నయ్య, వూరివాళ్ళతో కలిసి గునపాలతో తవ్వటం మొదలెట్టారు. మా నాన్న ఎవరూ చూడకుండా, జువ్వి చెట్టు రెమ్మల్లో దాక్కుని, దేవీ విగ్రహం కనపడే సమయానికి పెద్దపెద్ద రెమ్మలు త్రుంచి క్రిందకి పడేసాడు. ఆ విగ్రహాన్ని మా ఇంట్లోనే ప్రతిష్ఠించారు. నన్ను కోరిన యజమానికి నాలుగు రోజులు భయంతో విరోచనాలు అయ్యాయట! నేను మంత్రించి ఇచ్చిన మిరియాలు, నేతితో వేయించుకుని అన్నంలో కలుపుకొని మూడు పూటలు తింటే విరోచనాలు తగ్గాయిట. అందుకని అతని తోట మేము వుండటానికి 'దేవి నిలయం' కట్టుకుందుకు వ్రాసి ఇచ్చేడు. కాకతాళీయంగా కొంతమంది జబ్బులు నయం కావటం, కొంతమందికి పిల్లలు కలగటం, క్రమక్రమంగా, మా దేవి మహత్తు బాగా ప్రచారం లోనికి వచ్చింది. చాలా డబ్బు పోగయింది. 'దేవి'ని స్మరించిన వేళావిశేషం మా కుటుంబం హాయిగా జరిగిపోతోంది. మా అన్నలు నా శీల రక్షణకు ఈ పథకం వేసినా, ఆ పథకమే మా జీవనాధారం అయ్యింది. ఇద్దరు చెల్లెళ్ళకీ అన్నలకీ పెళ్ళిళ్ళు అయ్యాయి. నాన్న, అమ్మ హాయిగా వున్నారు. మేము నమ్ముకున్న 'దేవి'కి మందిరం కట్టించాము. ఉత్సవాలు చేస్తున్నాం. పూజలు చేస్తున్నాం. కోరికలు తీరినవాళ్ళు మా మహిమ అనుకుని ఇంకా

భక్తిపరవశులు అవుతున్నారు. తీరనివాళ్లు "మా పూర్వజన్మ కర్మ- మనకి ఏ భగవంతుడూ సాయం చేయలేడు. కర్మ పరిపక్వం కాలేదు." అన్న తరతరాల హిందూ వేదాంతమనే దుప్పటి ముసుగులో దూరుతున్నారు. ఇప్పుడు నాకనిపిస్తూంది. నాకు ముప్ఫయ్ ఏళ్ళు దాటుతున్నాయి. శీలరక్షణ కోసం, దేవీ కవచంలో దూరాను. కాని ఆ కవచం, నా జీవితాన్ని ఒక ఉక్కు చక్రంలో బిగించుతుందనుకోలేదు. మా అన్నలు, చెల్లెళ్ళు పిల్లాపాపలతో హాయిగా వుంటూంటే నాకు ఈ బ్రహ్మచర్య జీవితం రోజు రోజుకీ విసుగనిపిస్తోంది. ఎల్లా తప్పించుకోవటం నారాయణా!"

"ప్రజల మూఢ విశ్వాసాలమీద మీ జీవితాలని నడుపుకొంటున్నారా! దేముడు పూనకం అంటూ ప్రజలని వంచించటం, పాపం కాదూ!" అన్నాడు నారాయణ ఆశ్చర్యంగా వింటూ.

"పాపం, పుణ్యం ఎక్కడున్నాయి నారాయణా! మేము పేద బ్రాహ్మణులం. నిత్యదరిద్రంతో ఎన్ని గుమ్మాలు ఎక్కి దిగినా ఈ కరువు రోజుల్లో మా కడుపు నిండటంలేదు. ఎదిగిన ఆడపిల్లలం. మేము అందరికీ అనుభవనీయమైన వస్తువుల్లా కనపడుతున్నాం! అన్నయ్యలు స్మార్తం నేర్చుకున్నారు. తద్దినాలు వస్తేనే వాళ్ళు కడుపు నిండా తినేది! నిత్యం పొట్టలునిండే దెల్లా అని చూసుకునే సంసారంలో మేము గృహిణులెల్లా అవుతాం! విలాస వస్తువులుగా మారటం ఇష్టంలేదు. భార్యగా వుండే అర్హత సంపాయించలేము. కష్టసమయాల్లో భగవంతుడ్ని తలుచుకుంటాము. ఆ భగవంతుని పేరుతోనే మేము జీవనాధారం సంపాదించుకున్నాము. భగవంతునియందు భక్తివున్న వాళ్ళు ఇస్తున్నారు. లేనివాళ్ళు లేదు. మేము ఎవర్నీ పీడించటం లేదు! బాధ్యతగల ఉద్యోగాలుచేసి లంచాలు పట్టటంకన్నా, నీతిమాలి శరీరాలు అమ్ముకోవటంకన్నా ఇది నయంకాదూ! దేముని పేరుతో అవినీతి పాలబడకుండా ఒక పేద కుటుంబం తన కాళ్ళమీద తాను నిలబడింది. ఇది పాపమా!" అంది సావిత్రి.

"నిజమే సావిత్రీ. ఇది పాపం అన్పించటం లేదు. నువ్వు చెప్పిందంతా వింటే మీకూ ఆ సమయంలో ఇంతకంటే వేరు గత్యంతరం తోచి వుండదు." బాగా ఆలోచించినమీదట అన్నాడు. "మేము శ్రమకు పనికిరాము. తల్లితండ్రులు ఆర్జించి పోసిన మడిమాన్యాలు లేవు. ఈ కాలం చదువులు రావు! ఇప్పుడిప్పుడు చాలా మటుకు పౌరోహిత్యాలు కూడా తగ్గిపోయేయి! దేవి దయవల్ల మా కుటుంబం ఇప్పుడు ఏ లోటూ లేకుండా జరిగిపోతోంది. కానీ .

"కానీ?"

"నాకు. ఈ దేవి పదవిమీద మోజు లేదు. నాకు సంసారి నవ్వాలనీ, అన్నల్లా, చెల్లెళ్లా నేనూ సంసార జీవితం అనుభవించాలనీ వుంది నారాయణా! చిన్నప్పుడు అస్తమానూ, మీ అమ్మతో నన్ను పెళ్లాడుతాను అనే వాడివి. ఇప్పుడు నేను నీతో వచ్చేస్తాను. మీరు వుండేది చాలాదూరం! అక్కడ నన్ను ఎవరు గుర్తుపడతారు! నన్ను నీతో తీసుకెళ్ళు నారాయణా!" అంది దీనంగా సావిత్రి ముఖందించుకుని.

నారాయణ మనస్సు ద్రవించింది. పదహారేళ్ళ క్రితం సావిత్రి ఈ కోరిక కోరింది. అప్పుడు తను సాహసించ లేకపోయేడు. తిరిగి ఈనాడు అదే కోరిక కోరుతోంది. ఇన్నేళ్ళయినా ఈ అమ్మాయికి తనతోనే వచ్చేయాలనే కోరిక ఎందుకు కలుగుతోంది! ఇన్నాళ్ళ జీవితంలో ఆమెకి ఆ కోరిక కోరదగ్గ పురుషుడే తటస్థపడలేదా! లేక చిన్నప్పట్నించీ ఆ పిల్లకి తనయందే ఆ భావం మొలకెత్తి దృఢపడిందా! ప్రేమంటే ఇదేనా!" నారాయణ శరీరం జలదరించింది.

"సావిత్రీ!" కన్నీటితో అన్నాడు నారాయణ.

"ఒకరోజు నన్ను ఇదే కోరిక కోరావు. అప్పుడు అమ్మ అనారోగ్యంతో. అస్థిమిత మనస్సుతో. నీ కోరికని అంగీకరించలేకపోయేను. నువ్వు ఇప్పుడు అన్నిటా నా కంటె చాలా ఎత్తులో వున్నావు. నీ మనస్సులోని ప్రేమే నీకీ దేవీ పీఠం సమర్పించింది. ఉన్నత శిఖరంనించి నీచ మయిన పంకిలంలోకి జారకు! చూస్తూ చూస్తూ, నీవంటి ఉన్నత వంశీకురాలిని శీలవంతురాలినీ భ్రష్ఠురాలిని చేయలేను. నిజంగా నీవు నా కంటికి దేవీమూర్తిలానే కన్పించుతున్నావు! నీకంటె తక్కువ కులంవాడ్ని. పదహారేళ్ళనించీ సంసార జీవితం అనుభవించిన వాడ్ని! నేను నిన్ను తీసుకువెళ్ళి నీకు మావంటివాళ్ళ ఇంట్లో ఎల్లాంటి స్థానం ఈయగలను! వద్దు సావిత్రీ! వద్దు!" చప్పున చేతులు జోడించి లేచాడు.

"నారాయణా! ఇంత సంసార బంధం మీద చాపల్యాన్ని పెంచుకున్నాక, ఇంక నేను దేవిని కాలేనేమో నారాయణా! నేను దేవినికాను. కాలేను" అంది కన్నీళ్ళతో.

"నీ ప్రేమనీ. దయనీ, వేలాదిమంది భక్తులకి పంచి ఇస్తున్నావు. నీ వక్క త్యాగంవల్ల, మీ ఇంట్లో నాలుగు సంసారాలు చల్లగా సాగుతున్నాయి. వాళ్ళ తృప్తిలోనే నీ జీవితశాంతి వుంది, యోహాగ్ని శాశ్వతం కాదు. జీవితానికి స్థిరత్వం ఇచ్చేది ప్రశాంత ఏకాగ్రత మాత్రమే! సావిత్రీ! నువ్వు ఈ రోజు కాకపోయినా, వక రోజుకి తెలుసుకుంటావు!" అన్నాడు నారాయణ. సావిత్రి అరచేతుల్ని కళ్ళ కద్దుకున్నాడు భక్తిగా! నారాయణ భక్తికి సావిత్రి గొంతుమూగదైపోయింది. సావిత్రి మాట్లాడకుండా లేచి, తెల్లని చీరచెంగు తలచుట్టూ కప్పుకుని పొడవాటి పేకుచెట్ల నీడల్లోకి వడివడిగా నడిచి వెళ్ళిపోయింది.

మినీకథ:

# "ప్రాక్టికల్ నాలెడ్జి"

తన పిల్లలు చెడిపోవడం జగన్నాధాని కిష్టంలేదు. వాళ్లిద్దరూ పెరిగి పెద్దవారయి తనకు కీర్తిప్రతిష్ఠ తేవాలి. వాళ్ల సక్రమ మార్గంలో పెరగాలంటే వాళ్లు ఏ దురల వాట్లకూ లోనుకాకూడదు. తన తద నంతరం తన ఆస్థిని వృధాచేయకూడదు. అదీ ఆతని ఆశయం. అందుకే ఆతడు ఒక రోజు ఓ క్షయవ్యాధిని యింటికి తీసు కొచ్చి "చూడండి! ఇతడు నా స్నేహితుడు. సిగరెట్లు తాగి క్షయ కొనితెచ్చుకుని ఎలా బాధపడుతున్నాడో గమనించండి" అన్నాడు. పిల్లలిద్దరూ సిగరెట్లు తాగరాద దని నిశ్చయించుకున్నారు వెంటనే. మరో రోజు మరో టీబీ పేషెంటు. అతడు త్రాగుబోతు అని చెప్పాడు జగన్నాధం కొడుకులకు. తాగకూడదని నిశ్చయించు కున్నారు వారిద్దరూ. మరో రోజు మరొకడు. ఆ మరుసటి రోజు ఇంకొ కడు. ఇలా చాలా దురలవాట్ల గూర్చి కొడుకులకి 'ఇన్‌డైరక్టు'గా పాఠాలు చెప్పాడు జగన్నాధం.

ఒక రోజు కొడుకు లిద్దరినీ రేసు కోర్సుకి తీసుకెళ్ళాడు. "ఇతగాడు చూడండి వేలువేలు గుర్రాలమీద ధార పోస్తాడు. ఉదాహరణకి ఇవాళ ఏదో టిక్కెట్టు కొన్నాడు. అతణ్ణి మీరిద్దరూ శ్రద్ధతో గమనించండి" అని ఓ వ్యక్తిని చూపెట్టాడు.

గుర్రాలు పరిగెత్తాయి. జగన్నాధం కొడుకులిద్దరూ ఆ వ్యక్తిని శ్రద్ధగా పరిశీ లిస్తున్నారు. ఆ వ్యక్తి గుర్రాలని అంత కంటే శ్రద్ధగా పరిశీలిస్తున్నాడు.

"రేసుల్లో ఇవాళ డబ్బు పోయి అతగా డెంత విలపిస్తాడో మీ కళ్ళతో మీరే స్వయంగా గమనించండి" అని మరోసారి అన్నాడు జగన్నాధం.

గుర్రాలు ఆగిపోయాయి. ఆ వ్యక్తికి జాక్‌పాట్ వచ్చింది. జగన్నాధం హతాశు డయాడు. కనుక 'రేసు గుర్రప్పందాల' వ్యసనం మాత్రం జన్మలో కొడుకులకు మాన్పించలేకపోయాడు. అతడి ఆస్తి అతని తదనంతరం హారతి అయింది.

—'కార్టూనిస్టు శశిధర్',




# లేమి లేని సమాజం

1951 లో.........

ఒకనాడు మన తెలుగు గడ్డమీద ఒక ఆధునిక ఋషీశ్వరుడు కాలూనాడు. ఆయనే భూదానోద్యమ తపస్వి వినోబాజీ.

పోచంపల్లిలో హరిజన కుటుంబాలవారు పులకాంకిత దేహులైనారు.

అది చరిత్రాత్మక సంఘటనే. కాని భూమి సమస్య ఆమాత్రంతో తీరదు.

1973 సంవత్సరపు భూకమతాల గరిష్ట చట్టం యిప్పుడు మన రాష్ట్రంలో అమలు జరుగుతున్నది. భూస్వాములనుండి తీసుకున్న మిగులు భూమిని భూమి లేని నిరుపేదలకు, హరిజనులకు, గిరిజనులకు పంచుతారు.

ఇవ్వాళ లేనివాడు రేపు ఉన్నవాడవుతాడు. పాతికేండ్ల నాడు ప్రారంభమైన యీ ఉద్యమం ఫలించబోతున్నది.

సామ్యవాద సమాజ మార్గంలో యిదొక పెద్ద మజిలీ.

---

సమాచార, పౌర సంబంధశాఖ, హైదరాబాదు.

సీరియల్

# స్నేహమంగళా

ఎ. శ్యామలారాణి

జరిగిన కథ: చిన్నతనంలోనే తల్లి దండ్రుల్ని పోగొట్టుకున్న మంగళకు అండగా నిలిచి ఆమె ఆస్తిపాస్తుల్ని సంరక్షించి ఆదరించాడు చౌదరి రామం కుటుంబంలో దాదాపు ఒక మనిషిగా మసలేది మంగళ. రామం భార్య గౌరి అంటే ఎంతో అభిమానం. రామం తమ్ముడు రాజంటే ఎంతో అనురాగం ఆమెకు. రాజు చదువుకు డబ్బు సాయం చెయ్యడానికి తనకున్న ఒక్క ఆధారమూ అయిన యిల్లు అమ్మేసింది మంగళ. పట్నంలో పెరిగి చదువుకున్న గౌరి, మురళీబాబును ప్రేమించీ అతన్ని పొందలేక పోయిందన్న విషయం ఒక సందర్భంలో గౌరే చెప్పింది మంగళకు. ఇల్లు అమ్మిన మంగళని తన యింట్లోనే వుండమన్నాడు రామం. మురళీబాబు వచ్చి గౌరిని కలుసుకొన్నాడు. గౌరి పిన్ని ఆడిన దుర్మార్గపు నాటకం కారణంగా మురళీబాబు తనను చేసుకోలేక పోయాడని తెలిసిన గౌరి కలత చెందింది. తన స్నేహితురాలు కృష్ణవేణిని పడుపువృత్తిలోకి దింప ప్రయత్నిస్తున్న ఆమె తల్లికి నచ్చచెప్పి కాపాడింది మంగళ. కృష్ణవేణిని పొందాలని చూసిన రంగనాథానికి బుద్ధి చెప్పింది మంగళ.

స్వప్నలోకంలో విహరిస్తూన్న మంగళకు, తెల్లగా తెల్లారేవరకు మెలకువ రాలేదు. పెరట్లో కన్న కోయిల ననుసరిస్తూ, 'కూ, కూ'మంటున్నాడు. రామం అప్పటికే పాలు పితికేసి, పాలచెంబుతో, పెరట్లోంచి లోపలికొస్తున్నాడు. కిటికీ లోంచి వీధిలోకి తొంగిచూసింది. పల్లె అంతా పహాసందడిగా ఉంది. గౌరి నీళ్లు తోడుతున్న సూచనగా గిలక 'టిర్ర్-టిర్ర్' మంటూంది. "మొద్దు నిద్దర!" చిన్నగా లెంప వాయించుకుంది మంగళ. బద్ధకంగా ఒళ్లు విరుచుకుని తనలో తనే నవ్వుకుంది. 'అయినా అనే వాళ్లు, అడిగే వాళ్లు లేకపోతే సోమరితనం బలుస్తుంది.

ఇంకెన్నాళ్లులే! రాజు తన రాజు. ఇప్పటికే కలలో కనపడి నిద్రపోనివ్వడం లేదే. ఇక తాళికట్టేక సంగతి అడగాలా?''

అలవాటు ప్రకారం ముస్తాబయి కన్నని వెంటబెట్టుకుని వీధిలోకి జారుకో బోతూంటే, పెదవులు బిగబట్టి మంగళనే గమనిస్తూన్న గౌరి, జడకుప్పెలు పట్టుకు లాగుతూ ''ఈ సంగతి తెలుసా?'' అంది గుట్టుగా.

''ఏ సంగతీ?'' అర్థమైనా అమాయకంగా అడిగింది మంగళ.

''మీబావరాజుకిఉత్తరంరాస్తున్నారు!''

''ఇదివరకెప్పుడూ రాయలేదా పాపం?''

''ఊఁహూఁ. రాయలేదు పాపం! అందుకే. '' అంటూ చెవి మెలిపెట్టింది గౌరి.

''అబ్బ - వదులూ!'' అని మంగళ విదిలించుకోబోతూంటే మరి కాస్త గట్టిగా పట్టుకుంది గౌరి. ''ఇంతకీ ఎక్కడికీ ప్రయాణం? కృష్ణవేణి దగ్గరకేనా?''

''ఏం, వెళ్ళొద్దా?'' మురిపెంగా అడిగింది మంగళ.

''వెళ్తే వెళ్లేవు కాని, అందరి సమస్యలూ నీ నెత్తిమీదేసుకురాకు. నీ పేరు నలుగురి నోళ్ళలో నానటం రాజు కిష్టం లేదు.'' అంది గంభీరంగా గౌరి చెవి వదిలిపెడుతూ.

పరిస్థితుల ప్రభావంకొద్దీ ఈవాళిలా పిల్లిలా ఉన్నా రంగనాధంలాంటి వాళ్ల వలన ఏమైనా ప్రమాదం కలగవచ్చునన్న ఊహ గౌరికి భయాన్ని కలగజేస్తూందని మంగళకు తెలుసు. 'పోనిస్తూ నీకన్నీ భయాలే!'నని నవ్వుకుంటూ జారుకుంది.

# 6

మంగళ వెంట కృష్ణవేణి ఇంటికెళ్లడమంటే మహా సరదా కన్నకి. స్నేహితురాళ్లిద్దరూ మాట్లాడుకుంటున్నంతసేపూ, పెద్ద విద్వాంసుడి పోజుపెట్టి, తబలా 'గుమ్‌గుమ్మ'నిపించుకుంటూ ఏదో అలౌకికానందాన్ని పొందుతూంటాడు వాడు.

కృష్ణవేణి కూనిరాగంతో ఏదో జావళీ పాడుకుంటూ తీరిగ్గా తివాచీమీద కూచుని కాలి మువ్వలు మెల్లగా విప్పుకుంటూంది. కన్నని సడి చేయవద్దని సంజ్ఞచేస్తూ వెనుకగా వెళ్ళి కళ్ళు మూసింది మంగళ.

"ఇంత మెత్తని చేతులింకెవరివోయ్? మా సర్వమంగళాదేవే!" ఆప్యాయంగా రెండు చేతులూ పట్టుకుని మెల్లగా విడిపించుకుంది కృష్ణవేణి.

ఆనందంతో వెలిగిపోతూన్న మంగళ ముఖాన్నోమారు తదేకంగా చూసి, ఏదో అడగాలనుకుంటూ, కళ్ళు రెపరెపలాడించి కాసేపూరుకుని, "సత్తరకాయ కూడా వచ్చేడే తప్పు తప్పు. ఆస్థాన విద్వాంసుడు పోరా పిచ్చినాయనా! వాయించుకో" అని వాడిని తబలాకేసి తోసి "ఏమిటి కధ?" అంటూ మంగళ వేపు తిరిగింది.

"ముందు నీ కధెలా వుందో చెప్పు."

"నాకేం! నీ ధర్మమానని హాయిగానే ఉన్నాను. నేనేదో తరువాత్తరువాత ఆర్జించి పోస్తానన్న ఆశతో మరికాస్త ముద్దుగా చూస్తున్నారు వీళ్ళు."

"రెండు దెయ్యాలూ ఎక్కడ వున్నాయింతకీ?" గుంభనగా అడిగింది మంగళ.

టెలివిజన్ కొనిచూడు!




"ఇప్పుడే నాకు పారం నీతి బోధ పూర్తయ్యాయి. లోపలేదో అఘోరిస్తున్నారు కాని, నువ్వెందుకో ఈవాళ మరీ అందంగా, ఆనందంగా కనుపిస్తున్నావు. ఏదో విశేషమున్నట్లుంది-నీ కళ్ళు మెరుస్తున్నాయి. చెప్పకపోతే నా మీదొట్టు" అంది చట్టున కృష్ణవేణి.

మంగళ కొక్కసారి ఎక్కడ లేని సిగ్గు ముంచుకొచ్చింది. తబలా వాయిద్యంలో లీనమైపోయిన కన్నగాడి ఉంగరాల జుట్టులోకి వేళ్ళు పోనిచ్చి నిమురుతూ "అబ్బే విశేష మేముంది?" అంది జారుకుంటూ.

"కొయ్యికోయ్ పక్షీ! అసలు నువ్వింత సిగ్గుపడ్డావంటేనే విశేషం. చెప్పు మరీ!" అంటూ రెక్క పుచ్చుకుని దూరంగా ఉన్న పందిరి మంచం దగ్గరకు తీసుకుపోయి, అందుమీద కూలేసింది.

మంగళ బిడియంగా తన ప్రతిబింబాన్ని అద్దంలో చూసుకుంటూ అంది; "ఈవాళ మా రామం బావ వాళ్ళ తమ్ముడికి ఉత్తరం రాస్తున్నాడు."

"అంటే. ఇదివర కెప్పుడూ వాళ్ళు ఉత్తరాలు రాసుకోలేదా?" గమ్మత్తుగా నవ్వి చెవి పట్టుకుంది కృష్ణ.

"అబ్బ చాల్లే వదిలిపెట్టు-మరీ ఏమీ ఎరగనట్టు!" కందిపోయిన చెవి రాసుకుంటూ, మరింత కందిపోయిన ముఖంతో చిరుకోపంతో చూసింది మంగళ.

కృష్ణవేణి మౌనంగా బయటకు చూస్తూ కాసేపు ఊరుకుని అంది:

"నువ్వు చాలా అదృష్టవంతురాలివి మంగళా!"

"ఇప్పుడు నీ అదృష్టానికేం తక్కువ



వొచ్చింది?"

"ఏమో, తెచ్చిపెట్టు కున్న ధైర్యంతో రోజు లీడుస్తున్నానే కాని, అప్పు డప్పుడు విపరీతమైన భయం వేస్తూంటుంది. లేని పోని ఆశలు పెంచు కొని. మిధ్యలో బతుకు తున్నా నేమోనని. సవ్యమైన వ్యవ హారాలే ఎన్నో విఫలమై పోతూంటాయి. ఏ కారణం చేతనయినా, గోవిందు నన్ను పెళ్ళి చేసుకుందుకి అంగీకరించకపోతే అప్పుడు నా గతేం కావాలి? నాకు తలచు కుందుకే భయం-తలపు రాకమానదు. ఏం చెయ్యమంటావ్." కృష్ణవేణి ఎంత నిగ్ర హించుకున్నా కళ్ళల్లో చిన్న తడి మెరు స్తూనే వుంది.

"ఛ-అన్నీ పిచ్చి ఆలోచనలు గోవిందు నింతేనన్నమాట నువ్వర్ధం చేసుకున్నది?" కసురుతూనే ధైర్యం చెప్పిన మంగళ కూడా ఆలోచనలో పడింది. అవును, కృష్ణకున్న భయం సహజమే. గౌరి, మురళి బాబు విషయంలో అంతేగా జరి గింది మరి! ఇంతకీ, ఏ కారణం చేత నయినా, రాజుతో తన పెళ్ళి జరక్కపోతే? కొరడా దెబ్బ తిన్నట్టు ఒక్కసారి విల విల్లాడి పోయింది మంగళ.

"నిజమేలే! నువ్వన్నట్టు నావి పిచ్చి ఆలోచనలే, మనసు కోతిలాంటిది. చెప్పి నట్లు వినదు" పశ్చాత్తాపం చెందుతున్న ట్లుంది కృష్ణ. ఇంచు మించు అవే మాట లతో తన నూరడించుకుని, సఫలీకృతు రాలైంది మంగళ. తరువాత ఇద్దరూ మనసులు తేలికపరచుకొని, భవిష్యత్తుని రంగు రంగుల కలలలో చిత్రించుకుని తృప్తిపడ్డారు.

వెళ్ళేటప్పుడు వంటరిగా చిక్కిన మాణిక్యాన్ని సంబరంగా పలకరించింది మంగళ. "మాణిక్యం, నువ్వు వట్టి వెర్రి బావుల్దానివి. ఆ జీవరత్నానికున్న గడుసు దనంలో కోటోవంతయినా లేదు పాపం ప్చ్ చూడు, ఇప్పుడు కృష్ణ మనసు మార్చుకుంది. కాలి గజ్జెలు ఘల్లుమని పిస్తూందీ అంటే, ముందు ముందు ఇక కనక వర్షం కురిపిస్తుందనే అర్ధం ఆ సంపదలో వాటాకి కాకపోతే ఈ ముసిలి ముండ జీవరత్నం ఎందుకింత ప్రేమ ఒలకబోస్తుంది? దాని దగ్గర డబ్బున్న నాడు నీకేసి కన్నెత్తయినా చూసిందా? నువ్వు వెర్రిమాలోకంలాగ, నీ కూతుర్ని దాని కప్పగించి, తెల్లముఖం వేసు కూర్చున్నావంటే, రేపు నువ్వు నెత్తిమీద కొంగేసుకు పోవలసిందే. కృష్ణకూడా అదంటే పడిఛస్తూందిప్పుడు. అంచేత నా మాట విని, ఇప్పుడేనా తెలివితెచ్చుకుని, మంచిగానే దాన్ని సాగనంపే ప్రయత్నం చెయ్యి" ఆత్మీయతగా ఓ చిన్న హితోప దేశం చేసి చల్లగా ఇంటిదారి పట్టింది మంగళ.

కారా కిల్లీ బుగ్గనుంచుకుని, దీర్ఘాలో చనలో మునిగిన మాణిక్యాన్ని, "ఓలి మానిక్కెం!" అని పిలుస్తూంది, తన గొడు గొంతుతో, శ్రావ్యంగా, జీవరత్నం.

"ఎందుకో అలా పిలిసి సస్తనే ఉంటవి. ముండ!" వినీ వినపడకుండా చీదరించు కుంటూ లోపలికి నడిచింది మాణిక్యం.

"చదువుకీ- తెలివితేటలకీ లంకె పెట్ట కూడదు. కాకపోతే చదువబ్బని మంగళ కిన్ని తెలివితేటలెలా వచ్చాయి?" అని అచ్చెరు వొందింది కృష్ణవేణి.

* * *

పల్లెకో కొత్త చైతన్య మొచ్చింది. నూకాలమ్మ పండుగ దగ్గరపడుతున్నది. అందంగా ఘటాలు అలంకరించి, డప్పులు మోగింపుకుంటూ ఓ ప్రక్క జోగు దండు తున్నారు. మరో ప్రక్క చదురులో సన్నా హాలు జోరుగా సాగిపోతున్నాయి. ఉత్సవా లీసారి భారీఎత్తున జరుగుతాయని, ఎన్నో సంబరాలు చూడొచ్చునని, పాలెం ప్రజ లంతా ఆనందోత్సాహాలతో ఎదురుచూస్తు న్నారు.

అంతకు వెయ్యిరెట్ల ఆత్రంతో రాజు దగ్గర్నుంచి ఉత్తరం కోసం ఎదురు చూస్తూంది మంగళ. జరగకేం చేస్తాయని కొండంత ధైర్యంతో మొదలెట్టిన కార్యాలు కొన్ని జీవితకాలమూ అసంపూర్తిగానే ఉండిపోతాయి. కొన్ని పనులెలా జరుగు తాయోనని పుట్టెడు బెంగతో సతమతమై పోతున్నప్పుడు అతి ఆశ్చర్యకరంగా, ఇట్టే సునాయాసంగా జరిగిపోతాయి.

రామం, రాజుకు ఉత్తరం రాసినరోజు జ్ఞాపకానికొచ్చింది మంగళకు. ఆ రోజు రామం ఎటో వెళ్ళొచ్చి, గుమ్మంలో అడుగుపెడుతూనే "ఏం గౌరీ! నిన్నెవరో మనింటికి కార్లో వచ్చారట! నువ్వు చెప్పనే లేదు!" అన్నాడు. ఆ మాటల వెనుక రామం మనసులో ఏముందో, గౌరి మన స్థితి ఎలా ఉందో తెలియదుకాని, తీరా రాజుకి ఉత్తరం రాసే తరుణంలో రామం అలా పలకడం, అపశకునంలా తోచి, గడగడ వణికిపోయింది తను. 'గౌరి చెప్పలేదు. ఏమని చెప్తుంది? ఎలా కప్పి పుచ్చుకోగలదిప్పుడు? ఎంత మంచివాడైనా సరే, అనుమానం అన్నది తలెత్తేక, ఏదో సర్వనాశనం కాకమానుతుందా?' ముచ్చెమ టలూ పోసుకుని, ముద్దలా ఓ మూల కూల బడి పోయింది ప్రక్కగదిలో తను.

గౌరి చెప్పింది. కాని తనతో చెప్పి నట్టు, కన్నీళ్ళు పెట్టుకుంటూ కాదు- నిశ్చ లంగా, నిర్వికారంగా, ఎప్పుడో కొనాలను కున్న వస్తువు, అవసరం తీరేక, అవకాశం లేకపోయినప్పుడు ఎదురుపడితే 'వద్దు పొ'మ్మని,పురళిబాబుని తిరిగి పొమ్మనటం సునాయాసంగా చెప్పింది.

మంగళ తన చెవులను తనే నమ్మలేక పోయింది.

"మీరుంటే ఉండమనేవారేమో! నేనెలా అనలేకపోయాను. అందులోనూ ఇది పల్లెటూరు- చిలవలూ- పలవలూ చెక్కు తారు."

"మంచిదానివే! ఎంత పల్లెటూరయితే మాత్రం? ఇంట్లో మగాడు లేకపోతే ఆ వచ్చినవాడిగతి అధోగతేనన్న మాట. తిన్నావా? లేదా? అని అడగవన్నమాట! ఇవేనా మీ చదువుకున్న పట్నపు పిల్లల మర్యాదలు?" రామం హృదయ వైశాల్యాన్ని, గౌరి ఎన్ని ఆనందపు మైళ్ళలో కొలుచుకుం టూందోననిపించిన తనకి,



అప్పటికి బిగుసుకుంటున్న ఉరితాడు సడలించినట్టు తేలిగ్గా ఊపిరి తీసుకుంది తను. ఏదో ఏదో కొంప మునిగిపోతుందని భయపడి చస్తూంటే, రామం గౌరి సహాయంతో ఆ రోజే రాజుకి ఉత్తరం రాసేశాడు. చిన్న అబద్ధంతో ప్రారంభించి, పెద్ద అనర్థాలు కొని తెచ్చుకోకుండా ఉన్నది ఉన్నట్టు సూటిగా చెప్పేయటం ఎంత మంచిది! తను చదువుకోకపోవడాన్నేమో, గౌరి అంత సూటిగా చెప్తుందని ఊహించలేకపోయింది వేళ్ళు మణికి కణతలు కొట్టుకుంది మంగళ.

రాజు దగ్గర్నుంచి ఎలాంటి జవాబు వస్తుందోనని అనుమానం మంచిది ఏ కోశానా లేకపోయినా, అంతవరకూ అందరితో చెప్పడం అట్టే మంచిదికాదని రామం ఊరుకున్నాడే కాని, చీటికీ, మాటికీ, ఏదో మాటంటూ మంగళ నల్లరి పెడుతూనే ఉంది గౌరి. అలిగినట్టు, కోపగించుకున్నట్టు వీలయినంతగా నటించి, అలసిపోతూన్న మంగళ ముఖమండలంలో, రోజుకో కొత్త 'తళుకు' అంటూ మరింత ఉడికిస్తూంది కృష్ణవేణి.

*　　*　　*

"ఇంకేం? అమ్మవారి పండుగ పదిహేను రోజులే ఉంది. పండక్కి ఎవరే వేషం కడుతున్నారో, ఎవరేం మొక్కుబడులు చెల్లిస్తున్నారో సంబరంగా చెప్పుకుంటున్నారు, రామం వాకిట్లో. ఓ వెన్నెల సాయంకాలం వేళ, ఆడపిల్లలంతా అల్లిబిల్లిగా, ఆటలతో, పాటలతో మహా కోలాహలంగా ఉంది వాతావరణం. అందరూ తలో పాటా పాడాలనుకున్నారు.

కన్నెపిల్లలందరికీ కలలుగనట మెక్కువ. కాని పాటపాడటం నాయుడు గారి కోడలు వంతయింది. ఆ పిల్లకి కలలు గనే వయసు దాటింది. కన్నవారు తనకు చూడరాలేదని దిగులు పట్టుకున్నట్టుంది.

"రుధరాసి రుదమావిఁడో, నోవీఁ
నోవఁన్నాల
నల్లగొండలపైన నన్నిచ్చినారూ,
నన్నిచ్చి నేడాది, రారూ కన్నోరూ,
కారువానలు గురిసి, కలగడ్లు బలిసె
నన్నిచ్చీ నేడాదీ రారూ కన్నోరూ
ఎంపళ్ళూ పూసాయీ, ఏరూ కొరి
గాయీ
దారీ కానా నేక రారూ కన్నోరూ!"

తన పుట్టింటి సౌభాగ్యం తలుపుకొచ్చి కాబోలు గౌరి ముఖం చిన్నబోయింది. తరువాత గ్రామసేవిక లలిత వంతు-

'ఎవరికోసం ఎదురుచూపు?
ఎంతకాలమనీ నిరీక్షణ?
ఎవరు నీవారన్న దెరుగక,
ఎందుకో విలపించు చుందువు!'

లలిత భావగీతాలు బాగా పాడుతుంది. అదక్కడి వారెవరికీ నచ్చలేదు. ఆ భావ తరంగాల్లో మునిగిపోయిన గౌరి కనులు తడియటం మంగళ కంతకంటే నచ్చలేదు.

సరిగ్గా అదే సమయాన చౌదరిగారి లోగిలి కూడా మహా హడావిడిగా ఉంది. మునసబు-కరణాలు, పెద్ద-పిన్న అంతా చేరారు. గ్రామస్థులంతా ఎవరెవరేం బాధ్య తను వహించాలో, కార్యక్రమాలెలా జరిపించాలో వివరించబడుతూంది.

"అపసారం. అపసారం. ముందా రామయ్యని లెంపలేసుకోమను!" అంటు

టెలివిజన్ కొనిచూడు!




న్నాడు గురవయ్యసెట్టి గురక గొంతు కతో.

"ఏమేమి- ఏమన్నాడూ? కోళ్ళనీ, గొ(్రెల్ని కొయ్యడమెందుకు పండో, కాయో నైవేద్య వెట్టమంటాడా? ఇదేం అమ్మోరి పండగనుకున్నాడా? ఆటాలను కున్నాడా?" మరోమూల రంగనాథం నోరు జోరుగా సాగిపోతూంది.

"సూడు, రామయ్యా, నువ్వు సిన్నోడివి- నీకేటీ తెలీదుగాని, శక్తికి బలులు పడాలయ్యా బాబూ- అపసారం- మరేటనకు" వయోవృద్ధుడు శివారెడ్డి రామం భుజం తడుతున్నాడు.

"అయ్యవ్! పట్నవెల్లి ఆ తమ్ముడేం సదివాడుగాని, ఈయనగారే సదివుంటే పెపంచకమే తలకిందులైపోను!" దూరంగా కూచున్న ఇంకెవరో, మెల్లగా పక్క చెవిలో రొద పెడుతున్నారు.

"తప్పు- రాంబాబూ, అమ్మగారి విషయంలో ఆనవాయితీగా జరగవలసిందే- నీ ఉద్దేశం నా కర్థం అయిందనుకో కాని మనమేమి చెయ్యలేం!" నచ్చచెప్తున్నట్టుగా అంటున్నాడు చౌదరి.

ఎవరి మొక్కుబడులేమిటో, సుమారెన్ని గొ(్రెలు పడతాయో అంచనా కడుతూంటే. మనసులోంచీ ఏదో బాధమెదిలి, సహించలేక, "ఆవిడ అంత దయగల తల్లిగదా, ఇన్ని జీవాల్ని బలితీసుకోకపోతే, పళ్లో కాయిలో నైవేద్యా లెట్టించుకుంటే, సరిపోదా?" అని రామం అన్న మాట, అంత వ్యాఖ్యానానికీ, రాద్ధాంతానికీ, దారితీసింది.

అన్నీ విని, రామం అపచారం చేసినట్టు తలొంచుకున్నాడు.



ఒక్కొక్కరి కొక్క పని పురమాయిస్తున్నారు. భాగోతాలూ, పురాణాలూ. పుణ్య కథలూ ఏర్పాట్లు చేసుకుంది కి కొందర్ని నియమించారు. "అదుగో, మన రాయుడ్ని గారి తోట్లోమానుకొట్టుకో మందట తల్లి, రేపే ఆ పని నువ్వు చూడు రామం బాబూ!" అని అప్పజెప్తే "సరే" నన్నాడు రామం.

*　　*　　*

మాను నరికించడానికి పోతున్న రామం 'ఈవాళైనా వచ్చితీరాలి, మనరాజు దగ్గర్నుంచి ఉత్తరం.' అని గౌరితో అంటూంటే తెలియని దేవతలందరికీ కూడా మొక్కుకుంది మంగళ. అతని నోటిమాట నిజమై, కర్ణపేయమైన వార్త చెవులపడాలని.

అయితే ఆ రోజూ వుత్తరం రాలేదు. తోటకెళ్ళిన రామం తిరిగి రాలేదు. మంగళ మనసు మనసులో లేదు. రెండు ఝాముల వేళ, తల చిట్లిపోయి, రక్తంతో తడిసి ముద్దయిన శరీరాన్ని మోసుకుంటూ, నెత్తీ నోరూ బాదుకుంటూ పదిమంది వచ్చి పడ్డారింట్లో. మాను అనుకోకుండా విరిగి పడిందనీ, రామంతోపాటు మరొకడు కూడా దానికింద నలిగి పోయాడనీ వచ్చిన వాళ్ళు చెపుతూంటే ఉన్నచోటే కూలబడి పోయింది గౌరి.

సంబరంగా అన్నకి ఉత్తరం పోస్టు చేద్దామని బయల్దేరుతూన్న రాముకి పాలెం నుండి మనిషొచ్చి ఆ దుర్వార్త చెప్పే సరికి పట్టపగలే చిట్ట,చీకటై పోయింది. చేతిలో ఉత్తరం గాలికెగిరిపోయి, దూళిలో కప్పడిపోయింది.

రామం కళ్ళు బలవంతాన ఎత్తి చుట్టూ చూశాడు. ఊరి ఊరిడి జనం మూగివున్నారు. కాని రాజు కనిపించ లేదు. "గౌరీ! నే పోతున్నా నన్నే నమ్ముకున్న నిన్ను వంటరిదాన్ని చేసి పోతున్నా నీకిక ఆ దేవుడే దిక్కు"
వాతం కమ్మేసి చెరుపు పరుపుగా లోలో పలేమో గొణుక్కోడం మొదలెట్టేడు కాసేపు! మళ్ళీ కళ్ళు తెరచి పక్కకి చూశాడు. మండుతూన్న కళ్ళలో నీరు లోలోపలే హరించుకుపోయి, ఏడవటం రాని మనిషిలా చూస్తూన్న మంగళ కని పించింది. "మంగళా గౌరికి ఇక ఇక ను వ్వే!" ఇంకా ఏమో అన బోతూండగానే అతని తల నేల కొరిగి పోయింది. అతని కంటిలో నుండి రెండు కన్నీటి బిందువులు జారి భూమ్మీద పడ్డాయి.

*　　*　　*

మనుషుల కొక చక్కని విద్య తెలుసు. సమయం చిక్కితే చాలు, ఒకరి నొకరు తప్పులు పట్టుకుందికి, ఒకరిపై ఒకరు నింద లేసుకుందుకి సిద్ధంగా ఉంటారు. వీళ్ళకి పక్షవాతం లేదు. దేవుడైనా, దేవతయినాసరే నిర్భయంగా నిందించగలరు. అయితే దానికి 'సత్తా' అని 'మహత్మ్యం' అని కొన్ని రకాల ముద్దుపేర్లున్నాయి.

ఓ ప్రక్క పిడుగులాంటి వాడు, అనుకోనివిధంగా చచ్చిపడుంటే, మరో పక్క అమ్మతల్లి కోపగించిందని 'బలులు

తీసుకోకపోతేనే' మన్న రామం ప్రాణం తీసుకొని 'సత్తా' చూపించిందని గ్రామస్తులంతా తలో రకంగా, యథాశక్తి ఆవిడ నెత్తిన నాలుగక్షింతలు వేస్తున్నారు.

చివరికి 'మానుకూలి రామం మరణించాడని కాక, 'అమ్మోరు రామాన్ని బలుచ్చుకుంది' అని స్థిరపెట్టి, ఇంకా భయభక్తులతో ఆవిడను శాంతింపజేయటానికింకా ఇంకా ఏవో మొక్కులు మొక్కుతూనే వున్నారు.

రాజు వస్తూనే పసివాడికన్న హీనంగా విలపిస్తూ, అన్న మృతదేహం మీద వొరిగిపోయాడు. అతనికి తల్లి తండ్రి. సర్వ బంధువర్గం, చివరికి దైవం కూడా ఆ అన్నే మరి! గౌరి చిత్రాయిలా మొద్దుబారిపోయింది. అమ్మలక్కలంతా ఆమె చుట్టూ మూగేరు. ఈ భయానక దృశ్యాన్ని చూసి జడుసుకుపోయి, గోడ కతుక్కుపోయిన కన్నను, భుజం మీదేసుకొని దూరంగా తీసుకు పోయింది మంగళ.

తల్లికి ఆగ్రహ మొచ్చిందట! ఆగ్రహాలు చూపించటానికేనా ఈ తల్లులు? అందునా పసిబిడ్డలాంటి మనసున్న రామం మీదా? అపచారం తప్పు తప్పు నిజంగా అపచారం. తల్లికెప్పుడూ బిడ్డల మీద ప్రేమేగాని, పగ ఉండదు. ఈ తల్లు లేనా లేకపోయుండాలి కాని, ఉండమన్నదే నిజమైతే ఈ పగ, కసి సర్వ అబద్ధం-కల్పితం. మతిలేని మనుషులకి పుట్టిన తెగులు-పిచ్చి' మంగళ హృదయంలో మంటలు మండుతున్నాయి.

ఎవరెలాంటి నిర్వచనా లిచ్చుకున్నా ఖాతరు లేనిది కాలం. అందర్నీ వెక్కిరిస్తూ, ముందుకు పరుగులెత్తడమే దాని వాటం. మనిషి కూడా ఎప్పటికో ఒకప్పటికి, కాలానికి బందీనేనని గుర్తించి, పరుగు ప్రారంభించక తప్పదు. 'మరుపు' అనే అయాచిత వరం మనిషి నన్ని దుఃఖాల్నుంచి సడలించి, అందుకు దోహదం చేస్తుంది.

# 7

రాజు మాత్రం ఎవరెన్ని చెప్పినా, ఎన్ని వేదాంతాలు బోధించినా తేరుకోలేదు.

మూడు రోజులై పోయింది. రాత్రివరకు వీళ్ళు వాళ్ళు కూచుని, రకరకాల అనునయించి, ఎంగిలి పడమని చెప్పి వెళ్ళేరు. కన్నని బ్రతిమాలి తిండి తినిపించి, నిద్రపుచ్చి, బయటి కొచ్చింది మంగళ. పిండారబోసినట్టున్న వెన్నెట్లో గచ్చుమీద మోకాళ్ల మీద తలానించుకు శూన్యంలోకి చూస్తున్నాడు రాజు. వెన్నెల వెలుగులో అతని కంటిధారలు ఉండి ఉండి మెరుస్తున్నాయి. మంగళ వెనుకగా వచ్చి రాజు భుజం మీద చెయ్యి వేసింది. ఒక్కసారి వెను తిరిగి చూసి, పంచతో కళ్ళు తుడుచుకున్నాడు రాజు.

ఈసారి వస్తే రాజు పెళ్ళికొడుకుగానే వస్తాడు - తనప్పు డెలా అతని ఎదుట పడాలి? అతనేమి ఎగతాళి మాటలంటాడో సిగ్గు పొరలను విప్పుకొని, అతనితో ఏమని సంభాషించాలి?' అని పదే పదే పలు విధాలుగా ఊహించుకున్న మంగళ



హృదయంలో మధురభావాలే సుడిగాలిలో ఎగిరిపోయుండా లప్పుడు.

"వదిన పడుకుందా?" ఎలాగో నోరు పెకల్చుకున్నాడు రాజు.

"ఊఁ."

"నువ్వు పడుకో!"

"రాజూ!" బాధగా పిల్చింది మంగళ.

"నన్ను బలవంతం పెట్టకు మంగళా! నాకక్కర్లేదు. నేనేం తినలేను" మంగళ కంఠంలో బాధకి కారణం రాజుకి తెలుసు.

"ఇలా ఎన్నాళ్ళు పస్తులుంటావు? లే, రాజూ! నా కోసం కనీసం, నా తృప్తి కోసమైనా తినక తప్పదు నువ్వు" మంగళ కంఠంలోని అనునయం బిడ్డపై తల్లి వాత్సల్యంలా తరగలతో పొంగుకొస్తూన్నట్టుంది. చిన్ననాడే పోయిన తల్లి జ్ఞప్తి కొస్తుంది రాజుకి. ఆమె లేని లోటు తెలియనివ్వకుండా. తనను పెంచి పెద్ద చేసిన అన్న అనురాగం జ్ఞాపకానికొస్తూంది. ఇంత నిగ్రహించుకుందామని చేసిన ప్రయత్నం విఫలమైపోయింది.

"నాకు ఆకలి, దప్పిక తెలిస్తే నేనే వచ్చి అడుగుతాను. నన్ను వేధించక వెళ్ళు మంగళా" యథాప్రకారం రెండు మోకాళ్ల మధ్య తల దూర్చేసుకున్నాడు రాజు.

రాజు ఇప్పటివరకూ గౌరి ఎదుట పడలేదు. ఒక్క మాటాడలేదు. పగలంతా బయట కూచుని వచ్చే పోయే వాళ్ళతో గడిపేస్తాడు. ఎవరూ లేనప్పుడెటో దూరంగా వెళ్ళిపోతాడు. తిరిగి బాగా రాత్రయి, అందరూ నిద్రిస్తున్నారని నిర్ధారించుకుంటేగాని, లోనికి రాడు.

మర్నాడు అలాగే అర్ధరాత్రి దాటింది. మెల్లగా అడుగులేసుకుంటూ లోపలికొచ్చి తలుపు చారేసి, వెనుతిరిగాడు. ఎదురుగా మంగళ.

"వదిన పడుకుందా?" రోజూ మంగళ నతడడిగే మాట అదొక్కటే!

"లేదు, గౌరి నీ కోసమే చూస్తూంది. గౌరికిప్పటికున్న బాధలు చాలవనా రాజూ, నువ్విలా ప్రవర్తిస్తూన్నది?' నువ్వు తిండీ, తిప్పలు మాని ముఖం చాటు చేసుకొని తిరుగుతుంటే తను హాయిగా తిని పడుకుంటుందని మాత్రం ఎలా అనుకుంటున్నావు? పోయిన రామంబావ ఇక ఎలాగూ తిరిగి రాడు. కాని బతికున్న గౌరిని కూడా ఎందుకిలా చంపుతావు! ఈ హింసంతా చూడటానికేనా నే నిక్కడికొచ్చింది?' మంగళ అతనికేదో నెమ్మదిగా చెప్పబోయి, ఆవేశం వచ్చేసి, చివరకది దుఃఖంగా మారి ఏడవలేక, ఎవరో గొంతు నొక్కేసినట్లుగా ఆగిపోయింది.

రాజు కాసేపు దిక్కుతోచనివాడిలా ఇటూ అటూ కంగారుగా చూసి మెల్లగా గౌరి ఉన్న గదికేసి నడిచాడు. గౌరి వడిలో పడుకున్నాడు కన్న. ఆమె గుడ్డిగా వెలుగుతూన్న లాంతరుకేసి, నీరసించిపోయిన కనులతోనే నిశ్చలంగా చూస్తూంది. ఆ కళ్ళకిక ఏడవడాని క్కూడా శక్తి లేనట్లున్నాయి. గదిలో నిండిన వెలుతురు, నిస్పృహగా నిట్టూరుస్తున్నట్టుంది. ఎలాగో ధైర్యం తెచ్చుకొని, లేని బింకాన్నయినా నటించి గౌరిని ఓదార్చాలనుకుంటూ వెళ్ళిన రాజు, రెండు చేతులా ముఖం కప్పేసుకుని కూలబడ్డాడు.



ఐదు నిముషాలు పది నిముషాలు రాజు తనను తాను సంబాళించు కోలేక పోతున్నాడు

రా జూ జీరపోతూన్నకంఠంతో ఎల్చింది గౌరి

నువ్వే ఇలా దిగజారిపోతే ఇంకేం చూసుకు నేను బతికాలి చెప్పు ఏ ఆశ ధైర్యం చూసుకుని నేనీ బ్రతుకీడ్వాలి? లే రాజూ లే నా దురదృష్టం పెళ్ళయ్యే వరకూ నన్ను మాత్రమే పీల్చుకు తిందను కున్నాను కాని అది నన్నింకా వెంట తరిమి తరిమి నా సౌభాగ్యాల్నంతటినీ కొల్లగొట్టుకుపోతూ నీకు దేవుడిలాంటి అన్నను కూడా దూరం చేసింది అంటూ పట్టలేక తనూ ఏడ్చేసింది కరువు తీరా కన్నీరు కారిస్తే కాని మనసు తేలిక కాదు

రాజుకి అప్పటికి కొస్త తేలికొచ్చి నట్టయింది అది వట్టి తేలిక కాదు - శుద్ధ శూన్యం వైరాగ్యం నిరాశ నిస్పృహ ఆ వైరాగ్యం ఆవరించగానే కళ్ళు తుడి చేసుకొని ఏమేమో మాట్లాడేడు అందుకో గౌరికి ఒక్క ధైర్యవచనం కాని ఓదార్పు కాని ఏమీ లేవు అదో అయోమయం

ఇక మాట్లాడకు రాజూ-వెళ్ళి పడుకో' అని గౌరి బిగ్గరగా అరవడం వినిఎంచి మంగళ లోపల కొచ్చింది రాజు బయ టకు వెళ్ళిపోయాడు

రాజునట్టే మాటాడించకు మంగళా ఎందుకో ఆ ధోరణి వింటే నాకు భయం వేసింది మతిలేనివాడి మాటల్లావున్నాయి అంది గౌరి

* * *

మరో పదిరోజులు బరువుగా గడిచి పోయాయి మరునాడే నూకాలమ్మ పండుగ పల్లె జనానికి అప్పుడే రామం చావు పాతబడుతూంది జనం తండోప



తండాలుగా, ఊళ్ళ ఊళ్ళ నుంచి వచ్చి దిగుతున్నారు. ఎక్కడ చూసినా సంబరాలు, వేడుకలు - డప్పులు, వేషాలు కోలాహలంగా ఉంది పాలెం. రాజు చాలా గంభీరంగా మారిపోయాడు.

అవీ, ఇవీ చూపిస్తూ దిగులుగా ఉన్న కన్న మనసు కాస్త మళ్లించి, ఎక్కడెక్కడో తిరిగి ఇల్లు చేరుకుంది మంగళ. రాజు అక్కడా అక్కడా పడి ఉన్న తన గుడ్డలు తీసి పెట్టెలో కుక్కుకుంటున్నాడు.

బిత్తరపోయి చూస్తూ, "అదేమిటీ, ప్రయాణమా?" అని అడిగింది ఉండబట్టలేక. "అవును" ముక్తసరిగా అన్నాడు రాజు.

"ఎక్కడికి" వెల వెలబోతూ ప్రశ్నించింది.

"ఎక్కడైనా నరే, కాస్త మనసుకి ప్రశాంతత చిక్కుతుందేమోనని."

"ఎప్పుడు తిరిగొస్తావు?" జారిపోతున్న శక్తిని కూడదీసుకుని మామూలుగా అడగటానికి ప్రయత్నించింది మంగళ.

"చెప్పలేను."

ఎక్కడికి వెళ్తాడో తెలియదు - ఎన్నాళ్ళుంటాడో తెలియదు. ఎప్పుడొస్తాడో తెలియదు. రాజు మాటలు మంగళలో అసహనాన్ని రేకెత్తిస్తూంటే, తొందరపడి ఏమీ అనవద్దన్నట్టు లోనుండి గౌరి సైగ జేసింది. మంగళకు మనసులోంచీ దుఃఖం పొంగుకొస్తూంది. ఎలాగో ఒకలాగ, బ్రతిమాలో బోధపరచో అతని ప్రయాణం ఆపు చేయించాలని ఉంది. ఎన్నెన్ని విధాలుగానో ఊహించుకున్న మాటలన్ని వెనక్కిపోయి, రాజు ముఖం చూస్తూ చివరికిలా అంది: "సరే వెళ్ళు, కాని, ఎక్కడున్నాసరే మీ అన్నయ్యతో పాటు మేమంతా కూడా చచ్చిపోలేదని గుర్తుంచుకో చాలు, ఎంత దుఃఖాన్నణచి పెట్టుకుని, మంగళ అలా నొక్కి నొక్కి అంటుందో రాజుకి తెలుసు. కాని తనను తాను ఓదార్చుకోలేనివాడింకెవరిని ఓదార్చ గలడు?

బండికింకా చాలా టైముంది. ఎప్పుడు పట్నంవెళ్ళినా, అన్న బండి తోలుతూంటే దారంతా వసపిట్టల్లా వాగుతూ చీకూ చింతా లేకుండా హాయిగా వెళ్ళేవాడు. ఈసారి ఎవరున్నారు? గతాన్ని తవ్వుకుంటూ ఏదో పనున్నట్టు హడావిడిగా ఇటూ, అటూ తిరుగుతూ కాలహరణం చేస్తున్నాడు రాజు.

మంగళ నెమ్మదిగా వీధిలోకి జారుకుంది. ఆ వెళ్ళడం వెళ్ళడం తిన్నగా చౌదరిగారింటి కెళ్ళింది. చౌదరప్పుడే ఓ కునుకు తీసి, లేచి వాలు కుర్చీలో పడుకుని చుట్ట నిషాలో ఆనందాన్నాస్వాదిస్తున్నాడు.

మువ్వలపట్టీ 'గిల్ గిల్' మనిపించుకుంటూ, ఎదురుగా వచ్చి తలొంచుకు నిలబడింది మంగళ. ఆ పిల్ల అలా మాట్లాడకుండా నిల్చుంటే, ఏదో విశేషం పుండి వుంటుందని చౌదరి కనుమానమే.

"ఊఁ ఏమిటిలా వచ్చావ్?" మెల్లగా

కదలేసాడు.

"వసుమ తెప్పుడొస్తుంది?" వసుమతితో ఏదో అర్జంటు పని ఉన్నట్టుగా అడిగింది మంగళ.

"వస్తుందిలే, నెల్లాళ్ళలో!" ఆ పిల్ల అంతర్యం కనిపెట్టాలని చూస్తున్నా డతను.

"గోవిందో?"

"వాడూ దగ్గర్లోనే రావాలి మరి. వాడికి బోలెడు సంబంధాలొస్తున్నాయి. తొందర్లో ఏదో ఒకటి స్థిరం చేసేసి మూడు ముళ్ళు వేయాలి" చౌదరి మంగళని కనిపెట్టడం మరచిపోయి. ఏవో మాటల్లో పడ్డాడా వరసన.

"నాకు అర్జంటుగా రెండు కాదు-మూడొందలు కావాలి!" పుటుక్కున మంగళ అలా అడుగుతుందనుకోలేదు చౌదరి. ఏదో విశేష ముంటుందన్న అతని అనుమానం నిజమయింది. హఠాత్తుగా ఇంత డబ్బెందుకు చెప్మా అడిగితే ఈ పిల్ల అంత సులువుగా చెప్తుంది కనకనా? ఇప్పటికి ఇంటి మీద పుచ్చుకున్న డబ్బేం చేసిందో చెప్పిందా? మీది మిక్కిలి గట్టిగా అడిగితే. వసుమతొచ్చి తప్పంతా తనదే నన్నట్లు మాట్లాడుతుంది. నాలుగుడబ్బులు కూడా వెనకుంటే తోచదు కాబోలీ పిల్లకి! తనకేం? అవి కూడా అయిపోనీ, అప్పుడు చెప్పొచ్చు దాని పని! అనుకుంటూ మాట్లాడకుండా వెళ్ళి మూడొందలూ తెచ్చి ఇచ్చేసాడు.

అది తన డబ్బుగా కాక, చౌదరే ఇస్తున్నట్టు కృతజ్ఞతగా అందుకుని, ఉలుకూ పలుకూ లేకుండా వెళ్ళి పోతున్నందుకు క్షమించమన్నట్టుగా చూస్తూ గేటు తీసుకుని వచ్చేసింది మంగళ. 'ఎందుకు? ఏమిటి?' అన్న ప్రశ్నలు వెయ్యకుండా, తెచ్చి ఇచ్చేసినందుకే ఆ చూపని చౌదరికి తెలుసు.

రాజు ప్రయాణమవుతూన్న సంగతి పసికట్టి, ఇరుగూ పొరుగూ చేరి రక రకాల ప్రశ్నలతో వేధిస్తున్నారతన్ని. మంగళ వెనక తోవగుండా లోన ప్రవేశించి అటూ ఇటూ చూసి రాజు పెట్టె తెరచి. హడావిడిగా ఆ డబ్బు బట్టల అడుగున పడేసి, పెట్టె మూసేసి పరుగుతో బయట పడింది. అయితే జాలిగా ఓ రెండు కళ్ళు అదంతా గమనిస్తున్నాయని తెలిసేసరికి కలవరపడిపోతూ "అబ్బే! రాజు బట్టలు" ఏదో చెప్పబోయింది.

గౌరి భారంగా నిట్టూర్చింది.

"అహఁ ఎంతో లేదులే!" దాచలేక చూచాయగా అంది.

"దాని విలువ చెప్పతరం కానిది మంగళా! రాజు వట్టి పిచ్చివాడు. ఆ సంగతి గ్రహించలేక, ఇంకెక్కడో మన శ్శాంతి లభిస్తుందనుకుని వెళ్తున్నాడు. ప్చ్!" అని గౌరి అంటూంటే, అక్కడ నిల్చోలేకపోయింది మంగళ.

"రాజుబాబో బేగి రా మరి!" అని బయటనుండి బండితోలే వెంకన్న కేక లెడుతున్నాడు. రాజు గౌరితో చెప్పి వెళ్ళాలని లోని కొచ్చేడు. మంగళ కూడా అక్కడే ఉంది. రాజు తనతో వెళ్ళేముందు



టెలివిజన్ కొనిచూడు!



ఏం మాటాడుతాడోనని ఆత్రంగా ఎదురు చూస్తూ. రాజు దగ్గరగా వచ్చింది.

"కాస్త తరుచుగా వచ్చిపోతూండు, మంగళా!" అన్నాడు.

బిక్క ముఖం పెట్టుకుని నిల్చుండిపోయింది మంగళ. "ఊఁ .ఆఁ ." అనడం మరచిపోయింది. 'వచ్చి పొమ్మంటాడేమిటి? ఎక్కడికి పోవడం?'

రాజు వచ్చిన దగ్గర్నుంచి. మంగళ అక్కడ ఉండటమే చూస్తున్నాడు. ఐతే గౌరికి, కన్నకి కాస్త సాయం వచ్చి ఉంటుందనుకున్నాడు తప్ప, ఇల్లు వాకిలి పోయి, నిలవ నీడలేక అలా వచ్చిందని అతననుకోలేదు. ఎవరూ అతనికి ప్రత్యేకించి ఆ విషయాన్ని చెప్పేంత సమయమూ కాదది.

పరిస్థితి అంతా అవగాహన అయిన గౌరి, "వెళ్ళొస్తా వదినా' అని రాజంటుంటే, దుఃఖాన్ని దిగమింగుకుంటూ "మీ అన్నయ్య ఉత్తరానికి జవాబు రాసేవా?" అని అడిగింది.

రాజు మౌనంగా కాసేపు ఊరుకున్నాడు.

మంగళ గుండెలు దడ దడ కొట్టుకున్నాయి.

"రాసేను-సవ్యంగానే రాసేను కాని కాలమే వక్రించింది. నన్నేం చెయ్యమంటావు?" అనేసి వెళ్ళిపోయాడు. ఆ మాట మంగళకు కొండంత ధైర్యాన్నిచ్చింది. 'సవ్యంగానే రాసేను' అన్న ఒక్క ముక్కతో కోటి కోరికలు మొలకెత్తేయి. రాజు అలా వెళ్ళిపోతున్నందుకు నువ్వేమీ దిగులు పడక్కర్లేదు' అన్నట్టుగా గౌరి చూపులతోనే మంగళకు మరింత ధైర్యాన్నిచ్చింది.

(సశేషం)

# అతిమధురం

దీనికి యష్టిమధుకము అని కూడ మరో పేరున్నది. అతి మధురము చెట్టు యొక్క ఎండించిన కొమ్మ వేరు అనేక విధాలుగా ఉపయోగించవచ్చు. ఇది నార కలిగి యుండును.

ఆయుర్వేద మందులషాపుల్లో దొరుకుతుందీ అతిమధురం. ఎక్కువ తీపి కొద్ది కారం కలిసిన రుచి కలిగి యుండును. అతిమధురం చలువ, మేహ శాంతి జేయును. మూత్రము జారీ చేయును. కొద్ది విరేచన కారి. విష దోషములను హరించును. అతిమధురం మెత్తగా కొట్టి వస్త్రకాళితం చేసిన చూర్ణము పాలలో కలిపి తీసుకుంటే ఆయుర్వృద్ధిని కలుగ జేస్తుంది. జబ్బులనుండి కాపాడుతుంది. బాలింతరాండ్రకు పాలను వృద్ధిజేయును. అతిమధురం కషాయంతో నరుకు దెబ్బలను కడిగి చూర్ణమును నేతిలో ఉడికించి దెబ్బపై కడితే వెంటనే తగ్గుతుంది.

దెబ్బ తగిలి రక్తము కారుచుండిన ఈ చూర్ణము వేసి కట్టిన రక్తము కట్టును. త్వరలో పుండు మాన్పును.

ఈ చూర్ణముగాని కషాయముగాని తేనెతో కలిపి త్రాగిన పాండువు జబ్బు తగ్గును. చలువ మేహ శాంతి కలుగును. అతిమధురం తల వెంట్రుకలకు టానిక్ వంటిది. అతిమధురం చితకకొట్టి మందార పూలు చేర్చి కొబ్బరి నూనెలో వేసి కాచి తలకు రాసుకుంటే, వెంట్రుకలను గట్టిబరచి నల్లగా నుంచును. వృద్ధిపరచును. మృదుత్వము నిచ్చును. నేత్రవ్యాధులకు మేలు చేయును.

తాంబూలములో ఈ చూర్ణము వేసి తీసుకుంటే రుచిగా ఆరోగ్యముగా నుండును.

ఈ చూర్ణము, మంచిగంధపు చూర్ణము పాలలో కలిపి పుచ్చుకొనిన రక్తపిత్తము కట్టును.

అతిమధుర చూర్ణము ద్రాక్షపండ్లు పాలలో కలిపి తీసికొనిన మూత్ర బంధము సడలించి మూత్రము జారీచేయును.

దప్పిక ఎక్కువగా వుండి నోరు అర్చుకుపోయిన సమయంలో అతిమధురం ముక్క కొంచెం నోటిలో ఉంచుకొని చప్పరించిన చమ్మ కలిగి దాహము తీరును. గొంతులో శ్లేష్మమునకు ఈ ముక్క నములుతూ వుంటే శ్లేష్మము కరిగిపోవును. ఊపిరాడని శ్వాసతో నున్నపుడు ఈ ద్రవము మార్గమును మెత్తబరచి దారిని కలిగించును. బొంగురు గొంతుక, పొడి దగ్గు, ఉబ్బసము మొదలైన శ్లేష్మవ్యాధులను నివారించును. ఇంగ్లీషు మందులలో కూడ అతిమధురమును అనేక విధములుగా ఉపయోగించుచున్నారు.

—'సుగుణ'

# సడన్ గాళ్

పి యస్. నారాయణ

"వురేయ్ అన్నాయ్,

హైద్రాబాద్‌లో చలి మాంచి పట్టులో వుండగానే ఎగ్జిబిషన్ గూడా వచ్చేస్తుంది ఆ చలిలో రగ్గులాంటి స్వెట్టర్ నొకదాన్ని వంటికి తగిలించుకొని ఎగ్జిబిషన్‌లో మనుష్యులను త్రోసుకుంటూ తిరగటం కంటే మీ బ్రహ్మచారిగాళ్ళకు కావాల్సిందేమున్నది

అందుకే—

నీవు మొన్న ఇక్కడకు వచ్చినప్పుడు వేసుకున్న గొట్టం ప్యాంటు వేసుకొని, ఎర్రచారల పొడుగు చొక్కా టక్‌చేసి, ఆపైన గచ్చకాయరంగు ఆఫ్ స్వెట్టర్‌ను బిగించి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారి ఇన్ఫర్‌మేషన్ స్టాల్‌ముందు తచ్చట్లాడుతుండు— మంగళవారం సాయంత్రం ఆరుగంటల యాభై నిముషాలకు

బుధవారం లేస్తూనే నాకు ఉత్తరం రాసిపడేయ్

గుడ్ లక్

నీ చెల్లాయి—శారద"

రూం తలుపుతీస్తే క్రిందపడివున్న ఉత్తరంలో సారాంశం అది ఆ శారద మహాతల్లి మానాన్నకు స్వయానా అన్నయ్య అయిన ఓ పెద్దమనిషికి పెద్దకూతురు సరిగ్గా నేను పుట్టిన గంటకే అది పుట్టిందట— అందుకనే ఆలంఖిణికి అన్నయ్యనయ్యాను నేను!

ఆ ఎగ్జిబిషన్‌లో నన్ను కలుసుకోమని మరెవరో గూడా రాసివుంటుంది లేకపోతే వాత్స్యాయనగారి మిత్రుడికో రాయించి వుంటుంది

అదీగాకపోతే ఏ దురదృష్టవంతుడికో ఓ పాత చింతకాయపచ్చడి జాడీ ఇచ్చి 'మా అన్నేశ్వరుడు' పచ్చళ్ళకు మొఖం వాచి ఆ పట్నంలో పడివస్తున్నాడు— ఈ జాడీ తీసుకువెళ్ళి వాడికి ఇచ్చారంటే-రోజూ కాస్త టిఫిన్ బాక్స్‌లో పెట్టుకు వెళ్ళి తాజమహల్ హోటల్లో పెరుగన్నంలో నంచుకుతింటాడనో-లేకపోతేవాడు బ్రహ్మచర్యం అనుభవించ లేక చస్తున్నాడు— మీ పెద్దల్లుడిగారి చిన్నమ్మాయికో, పెదకూతురికో చూపించండి— అని రాసిపడేయించి వుంటుంది



అది నా డ్రస్‌మీద గూచా ఆంక్షలు విధించిందీ అంటే— ఇది చింతకాయ పచ్చడి వ్యవహారం కాదు— పెళ్ళి వ్యవహారమే అయివుంటుందీ అనిపించింది

రాక్షసీ' నిన్నెవ్వరే 'ఆడదీ' అన్నది'

*  *  *

జనం జనం కోలాహలం రంగురంగుల దీపాలు మైక్‌లో పాటల నడుమ ఎనౌన్స్‌మెంట్లు 'ఐదేళ్ళ పిల్లవాడు తప్పిపోయాడు తల్లికోసరం ఏడుస్తున్నాడు పేరు చెప్పటంలేదు ఐస్‌క్రీమ్ కొనియిస్తే మెదలకుండా కూర్చొని

తింటున్నాడు   ఆ తల్లి ఎక్కడున్నా వెంటనే వచ్చి ఆ ఐస్‌క్రీమ్ అయిపోయే లోగా ఆ పిల్లవాడిని తీసుకువెళ్ళ ప్రార్థన' ఓ విన్నపం

పక్కగా డాక్యుమెంటరీలు వేస్తున్నారు పంటలు   ఎరువులూ   పశువుల పెంపకం

టైం చూసుకున్నాను

ఆరూ నలభై ఎనిమిది   నలభై తొమ్మిది   యాభై   ఆరూ యాభై

"ఏఁవండీ' ఆరూ యాభై అయిం దాండీ'"

తీయటి కంఠానికి తలెత్తాను

"నా పేరు సరోజండీ   నేనూ శారదా ధిక్ ఫ్రండ్స్‌మండీ'"

నాకు నోటమాట పెగిల్తేనా'

"అది నేనంటే పడి చస్తుందండీ'" అన్నది కళ్ళు మూసుకు తెరిచి

'ఈ పిల్లను ఎందుకు కలుసుకోమంది చెప్మా నన్ను' అనుకొని విస్తుపోసాగాను నేను

"నేనూ అంతేనండి___ అదంటే అంత ప్రేమ!"

తాపీగా ఆ అమ్మాయి మొఖంలోకి చూచాను ఫరవాలేదు   అందమైనదే కాదంటే అసలు అందం కంటే తెచ్చిపెట్టు కున్న అందంకాస్త ఎక్కువగానే వున్నది రెండు జడలు వేసుకున్నది   గాజుల్లాంటి రింగులు చెవులకు పెట్టేసుకొని ఊరికినే కళ్ళను చక్రాల్లా తిప్పేస్తున్నది

కాస్త కోలుకొని, "మిమ్మల్ని కలవటం చాలా ఆనందదాయకంగా వున్నది   నా పేరు సత్యం'" అన్నాను.

"నాకూ అంతే   మిమ్మల్ని చూస్తుంటే శారదను చూస్తున్నట్లే వున్నది'" అన్నది సంతోషంగా "మీకు పచ్చిమిరపకాయ బజ్జీలు ఇష్టమేనా అండీ అక్కడ నిల్చొని తింటూ మాట్లాడు కుందాం రండి!"

"మీరేం చదువుతున్నారు?" అన్నాను రెండడుగులు వేసి.

"బి ఎస్ సి ఫైనల్  " అన్నది ఓరగా నా వంక చూస్తూ   కాస్త నా వైపుకు మెడ వంచింది నా కెక్కడ వినబడదోనన్నట్లుగా

"బి ఎస్ సి తరువాత ఏంచేద్దామను కుంటున్నారు?" నేనే కాస్త వెనక్కు వంగాను___ మళ్ళా సమాధానం చెప్ప టానికి మీదకొస్తుందేమోనని భయపడు తున్నట్లుగా___ ఓ ముక్కూ మొఖం తెలి యని ఆడపిల్ల వెంట అలా ఎగ్జిబిషన్‌లో పడి తిరుగుతుంటే తెలిసిన వారెవరైనా చూస్తే బాగుండదు

"మా శ్రీవారి నడగాలి'"

కాస్త కలవరపడ్డ మాట వాస్తవమే ఈ పిల్లకు పెళ్ళికూడా అయిందా?

నాలో మార్పును గమనిస్తున్నట్లుగా, "అఫ్‌కోర్స్   కాబోయే   పరీక్షలయ్యే లోగానే ఎవరో ఒకరు కావాలనే మా నాన్నగారి కోరిక'" అన్నది సిగ్గుపడుతూ న్నట్లుగా నవ్వి

"మీ ఉద్దేశం'" అన్నాను ఆ అమ్మా యిని చదువుదామన్నట్లుగా

"మంచి వారెవరయినా దొరికితే ఆ మూడు ముళ్ళూ వేయించుకోవాలనే నేనూ అనుకుంటున్నాను   "

టెలివిజన్ కొనిచూడు!




"మంచివాళ్ళా అంటే—?"

"నా చేతిక్రిందపడి వుండాలనేది నా ఉద్దేశ్యం కాకపోయినా— నా మాటకు గౌరవం ఇస్తే చాలు" అన్నది పెద్దగా నవ్వి

"చాలా ఫ్రాంక్ ఎండ్ ప్లెయిన్" హృదయపూర్వకంగా అన్నాను. నిజమే.

"థాంక్యూ"

పచ్చిమిరపకాయ బజ్జీలు సలసలా కాగిపోతున్నాయి చింత చెట్టు క్రిందుగా పక్క పక్కగా చేతుల్లో కాగితాల్లో పచ్చి మిరపకాయ బజ్జీలు పెట్టుకొని నిలబడ్డాం.

చలి శరీరాన్ని పొక్కుతోంది

శారద మహాతల్లి ఇద్దరినీ ఇలా మాట్లాడుకోమని ఓ అవకాశాన్ని కలిగించిందన్న మాట.

చాలా మంచిపిల్ల.

నాకు అందమయిన అమ్మాయిలతో రోడ్ల వెంట తిరగాలనేది ఓ కోరికే అయినా మనస్సును మంచులా పట్టుకున్న 'సిగ్గు' చాలా అవకాశాల్ని జారవిడుచుకునేలా చేసింది

ఎర్రటిఎరుపు అంతకుమించి ఎర్రటి డ్రస్సులో సరోజ వెలిగిపోతున్నదనే చెప్పాలి

కొత్త బజ్జీలు కారం పుడుతున్నయ్యేమోననిపించింది. అదే అంటే సరోజ నవ్వింది

"ఈ మాత్రం కారాన్ని భరించలేని వారు జీవితంలో కష్టాల్ని ఎలా భరిస్తారు? నాకు తెలియకుండా వున్నది" అన్నది నా వంక కళ్ళెత్తి చూస్తూ నవ్వి

నేను నవ్వేసి ఊరుకున్నాను

"మీకు ఫారిన్ వెళ్ళాలనే ఉద్దేశం

ఏమైనా వున్నదా?"

"ప్రస్తుతానికి లేదు అవకాశమొస్తే చెప్పలేను

"ఐసీ " అన్నది తలవంచుకుంటూ

బ్రాయ్ త్రాగాం.

మళ్ళీ నడుస్తున్నాం

"హ్యాండీ క్రాఫ్ట్సవారి స్టాల్‌కు వెళ్దాం పదండి మంచి బొమ్మేదయినా సెలక్టు చేద్దురుగాని" అన్నది సరోజ దారి మారుస్తూ

"పదండి," అనుసరించాను

"నా లెక్క కరెక్ట యినట్లయితే మీకు అన్ని సబ్జక్టులలోనూ మంచి మార్కులు వస్తుంటాయి—అవునా" అన్నది నా వంక చూసి నవ్వుతూ

"ష్యూర్"

ఫక్కున నవ్వేసింది

"థాంక్యూ నా ఎసెస్‌మెంట్ కరెక్టు"

మనస్సు చివుక్కుమనే అనుమానం నాకు కలిగింది—నన్ను ఆ అమ్మాయి ఓ పుస్తకాల పురుగు అనుకోవటం లేదుకదా!

"అంతేగాదు టేబుల్ టెన్నిస్ చాంపియన్‌ను గూడా అడపా తడపా కథలు రాస్తుంటాను "

"ఈజిట్ "

టెలివిజన్ కొనిచూడు !




"ఇంకేమైనా చెప్పమంటారా?" కష్టంగా అన్నాను

"నోనో అఫెండ్ అయినట్టున్నారు" అన్నది కాస్త తడబడి

"లేదండి మీరు నా చెల్లెలికి థిక్ ఫ్రెండ్ సరదాగా ఒక గంట కాలక్షేపానికి ఇక్కడకు వచ్చాం ఇందులో అఫెండ్ అవాల్సిందేమున్నది" తేలిగ్గానూ నిర్లక్ష్యంగానూ అన్నాను

"అంతేనా" అన్నది—ఆ కళ్ళల్లో తెలియని నిరాశ కనబడీ కనబడకుండా నా కళ్ళబడింది

"అవును ఇంకో గంటలో విడిపోబోయే మనం, మనస్సులు కష్టపెట్టుకోవడం దేనికి" చిన్నగా నవ్వాను ఆ అమ్మాయిలో లీలగా మెదులుతున్న పొగరుకు కళ్ళాలు వెయ్యాలనుకోవడమే నా ఉద్దేశం

"సారీ"

"ఎందుకు సారీ"

"మీరు నిజంగా అఫెండ్ అయ్యారు నేను తప్పుమాట ఏవన్నానబ్బా!" అన్నది కళ్ళు పెద్దవి చేసుకొని

నిజంగా ఆ కళ్ళను అప్పుడే చూడాలి!

ఆ కళ్ళే నావైతే

"శారదా! నీవు ఇంకా అంత దూరాన ఎందుకున్నావ్" అనుకున్నాను మనస్సులోనే కసిగా

"మీరలాగే వుండండి ఫుటోలవాడిని పిలుచుకు వస్తాను" అందామని గూడా అనిపించింది

అదుగో

ఆవిడ అమ్మాయి అయిపోయింది నా కళ్ళ ముందున్న ఆమెను కన్నార్పకుండా

చూస్తూంటె సిగ్గు ముంచుకొచ్చింది

"సరోజా సరోజా!" అనుకున్నాను బేలగా.

"ఏంవండీ ఇప్పుడు హ్యాండీ క్రాఫ్ట్‌కు వద్దుగాని ఫ్లైయింగ్ వీల్ ఎక్కుదాం పదండి, పీచుమిఠాయి కొను క్కొని తింటూ కూర్చుంటే బాగుంటుం దండీ!" అని నా చేయి పట్టుకొని ఆ జనంలో లాక్కు వెళ్ళసాగింది

నేను ఆ అమ్మాయి చేతి నుండి నా చేతిని విడిపించుకుంటూ, "ఇప్పుడు అది ఎక్కటం అంత అవసరమంటారా?" అన్నాను.

"సరదాగా ప్లీజ్!"

"మనకు తెలిసినవాళ్ళెవరైనా చూస్తే బాగుంటుందంటారా? ఆలోచించండి"

సరోజ నా వంకే చూస్తూ పెదిమను కొరుక్కోసాగింది కళ్ళు చికిలించి నా మొహంలోకే చూస్తోంది

"ఐసీ సారీ!" అన్నది

కోపం వచ్చిందన్నట్లుగా మూతి గూడా బిగించింది

ఆ మూతి బిగించిన తీరు నాకు నవ్వే తెప్పించింది

ఆడది ఏం చేసినా అందమే!

"మీరు చాలా బాగున్నారు!" అన్నాను తన్మయంగా ఆ అమ్మాయి మొహంలోకే చూస్తూ

"థాంక్యూ!"

"ఇక శెలవు ఇప్పిస్తారా?" గడి యారం చూచుకుంటూ అన్నాను

"ఓకే ఫిర్ మిలేంగే!"

"థాంక్యూ"

* * *

"ఒరేయ్ అన్నాయ్,

ఈ చెల్లిని క్షమించేసి ఈ రోజు కాస్త ఎగ్జిబిషన్‌కు వెళ్ళిరా

నశ్యంవారి నవ్వే బొమ్మదగ్గరకు నడు.

అక్కడకు పదడుగుల దూరంలో ఆ బొమ్మను చూస్తూ నిలబడి వుంటుంది వంటరిగా ఓ పిల్ల గులాబిరంగు చీరె కట్టుకొని, గులాబిరంగు జాకెట్టు తొడు క్కొని కుడి చెంపమీదగా గులాబీ పువ్వు పెట్టుకొని అయిదడుగుల నాలు గంగుళాల 'రాధ' నీ కోసరమే ఎదురు చూస్తూ నిలబడి వుంటుంది

కనుక అన్నయ్యా—

ఇవాళ రాసిపడేసినట్లే రేపూ ఒకటి రాసిపడేయ్ నా మొఖాన!

అబ్బ నీ పెళ్ళికాదుగానీ నా కెన్ని కష్టాలు వచ్చినయ్‌రా తండ్రీ

అన్నట్లు నీవు వెళ్ళటానికి టైం ఏడ్చిందిరోయ్

అది ఏడుగంటల పదినిముషాలు

—శారద"

ఓసినీ ఆలోచన మండా

నిన్ననే రాసి ఏడవగూడదూ ఈ సంగతి గూడా

కానీయ్

శారద మహాతల్లి తలుచుకుంటే తిరుగే మున్నది

ఏడుగంటల అయిదు నిముషాలకు నవ్వుల బొమ్మదగ్గరకు జేరాను

అక్కడ వుండనే వున్నది ఆ అమ్మాయి

దగ్గరికల్లా వెళ్ళి రెండు చేతులూ జోడించి, "నా పేరు సత్యం నేను

## టెలివిజన్ కొనిచూడు!



ఇంట్లో వస్తువులన్నీ అమ్మి
కొన్నానోయ్ దీన్ని!!!

---

శారదకు అన్నయ్యను!" అన్నాను

ఆ అమ్మాయి కలవరపడింది కళ్ళు రెపరెపలాడిస్తూ,సిగ్గుపడుతున్నట్లుగా నవ్వి తలవంచుకుని అన్నది

"నమస్తే నా పేరు రాధ' నేనూ శారదా ఫ్రండ్స్‌మండీ'"

"చాలా ధిక్కా?" అన్నాను కొంటెగా ఆ అమ్మాయివంక చూస్తూ

రాధ కాస్త నలుపేగాని— మొఖం లోని ఆ కళ నలుపును విరిచేస్తోంది ఆ పైన అరచేతులంత కన్నులు ఒక్క జడే వేసుకొని ఒత్తుగా చెవులకు రవ్వల దుద్దులు పెట్టుకుంది మెళ్ళో వంటిపేట గొలుసు

సింపుల్‌గా అందంగా వున్నది

"అలా వెళ్దామా'"

"పదండి'"

ఇద్దరం నడుస్తున్నాం పక్కపక్కగా

గుడ్డలషాపులు దుప్పట్లు మాట్లాడే బొమ్మలు గాజులషాపులు ఆడవాళ్ళ అలంకరణ సామాగ్రి పింగాణీ పాత్రలు

పక్కకు చూచాను ఆ అమ్మాయి వస్తున్నదా అన్నట్లుగా మాట్లాడదేం?

నాకే సిగ్గు నాకు మించిన సిగ్గులా వున్నది

"మీరేం చదువుతున్నారు?" నేనే చొరవ తీసుకొని ఇంటర్వ్యూ మొదలు పెట్టాను

"బి ఎ ఫైనల్ అండీ'"

"తరువాత?"

"గృహిణిగా గడపాలని నా ఆశయం. అయితే చక్కటి ఉద్యోగం ఏదైనా వస్తే చేయాలనేది కోరికే అయినా— అనుకున్న వన్నీ అవ్వాలనే ఎక్కడున్నది?" నిరాశగా అన్నది

"ధృఢ నిశ్చయమే వుండాలిగాని ఎందుకు లేవు?" వింతగా చూచాను "మా హాబీస్ తెలుసుకోవచ్చా?"

"భానుమతి పాటలంటే చెవికోసుకుంటాను "

తలెత్తి ఆమె చెవులవంక చూచాను గాస్లేమైనా వున్నయ్యా అన్నట్లుగా

ఆమె నా ఆలోచనను గ్రహించిందల్లే వున్నది సిగ్గుగా నవ్వింది

"ఎంబ్రాయిడరీ నేర్చుకున్నాను మంచి మంచి డిజైన్స్ కుట్టటం సరదా ట్రాజడీ సినిమాలు లైక్ చేస్తాను."

"అదేం?"

"ఎందుకో చెప్పలేను నేను కాస్త సీరియస్ మనిషిని."

"ఐసీ." ఒక్క-క్షణం ఆగాను "మీకు సంగీతం వచ్చా?"

"కొద్దిగా."

"మీరు కథలు చదువుతుంటారా?"

"ఎప్పుడన్నా."

"మీ భర్తగారికి ఫారిన్ ఛాన్స్‌వస్తే ఆయనతో వెళ్ళటానికి ఇష్టపడతారా లేకపోతే ఆయన వచ్చిందాకా ఎదురు చూస్తూ భారతదేశంలోనే వుండిపోతారా?"

"నాకైతే మనస్సులో వెళ్ళాలనే వుంటుంది ఆయనకు వీలుపడాలి గదా ఆపైన మిగతా పరిస్థితులు "

"రోజ్‌మిల్క్ త్రాగుదాం."

"పదండి."

నడుస్తున్నాం యిద్దరం సముద్రంలో ఈదుతున్నట్లుగా

మీకు పచ్చిమిరపకాయ బజ్జీలు యిష్టమా?" నిన్నటి గలగలలాడే సరోజ కళ్ళ ముందు కదిలింది.

ఆమె పరుగులెత్తే మహా ప్రవాహం అయితే రాధ నిదురపోయే సెలయేరు ఆమె మొఖంలోని ఎరుపు ఆమె అందాన్ని ఎలా పెంచుతుందో, రాధ నలుపు రాధకూ ఎస్సెట్టే ఆమె రెండు జడలు, ఆమె రింగులు ఆమెకే సరిపోయినయి

రాధ ఒంటిజడ, దిద్దులు, ఆ ముక్కుపుడక—ఈ అందం మాత్రం ఎవ్వరికి దొరుకుతుంది

శారదా! నన్ను ఇలాంటి ఫిక్స్‌లో పెట్టినందుకు నిన్ను చంపేస్తాను రాక్షసీ!

యిద్దరం మిల్క్-బూత్ దగ్గరకు వచ్చే టప్పటికిగాని నా ఆలోచనలు తెగలేదు

అప్పటికే—

రాధ రెండు బాటిల్స్ తీసుకొని ఒకటి నాకందిస్తోంది

వడివడిగా నేను డబ్బులివ్వబోయాను

"నేను ఇచ్చేశానులేండి."

"నోనో మీరివ్వట మేమిటి శారద నన్ను చంపేస్తుంది "

"నన్నా చంపేస్తుంది" అన్నది చిన్నగా నవ్వుతూ

నవ్వితే బుగ్గలు సొట్టపడి, పెదాలు అదోవిధంగా విరిగి రాధ అందమే అందం అన్నట్లుగా వున్నాయి,

ఒకటి రెండుసార్లు ఓరగా రాధ ముఖంలోకి చూచాను, అదే సమయంలో నా ముఖంలోకి అలాగే చూస్తూన్న ఆమెలో తడబాటును పట్టేసి నాలో నేను నవ్వుకున్నాను

జీవితం పరుగులెత్తాలంటే సరోజ కావాలి. పరుగులెత్తటంలో మంచు గడ్డలు

టెలివిజన్ కొనిచూడు!




దొర్లవచ్చు రాళ్ళు రప్పలు ఎదురవ్వవచ్చు, దెబ్బలు తగలవచ్చు అయితేనేం ఆకాశంలో విహంగంలా ఎగరవచ్చు లేక సాఫీగా భూమ్మీద రాధతో నడవాలా జీవితంలో థ్రిల్ వుంటుందో లేదో ఆనందం లభిస్తుందో లేదో ట్రాజడీ లైక్ చేసే రాధ జీవితంతో నా జీవితం ఏవో

శారదా. ఐ కిల్ యూ

"రేపుదయాన శారదకు ఏం రాయమంటారు?" అన్నాను తిన్నగా ఆమె మీదకు వంగుతున్నట్లు మెడవంచి

"రమ్మనమని రాయండి." అన్నది నవ్వి నా ప్రశ్నకు సమాధానం తప్పించేసింది

దూరంగా కనబడుతున్న ఫ్లయింగ్ వీల్‌ను చూస్తుంటే మళ్ళీ సరోజ కళ్ళ ముందు ఎగురుతూ కనబడింది

"ఫ్లయింగ్ వీల్ ఎక్కుదామా?" అన్నాను ఆశగా

ఆమె సమాధానం నాముందు జీవితానికే సమాధానంగా చేసుకుందామా అనిపించింది ఒక్కక్షణం.

ఆశగా ఆమె మొఖంలోకి చూచాను

"సారీ. వద్దండీ నాకు భయం." అన్నది

నన్ను నిరాశ కృంగతీసిందనేది నిస్సందేహం.

* * *

మరునాడు సాయంత్రం భయం భయంగా గది తలుపు తీశాను

ఆ రాక్షసి మరో ఉత్తరం రాయలేదు గదా?

మైగాడ్ ఉన్నదక్కడ

"అన్నాయ్,

సాయంత్రం ఏడుగంటలకు చంద్ర శేఖరం బాబాయ్ నీ రూంకు వస్తాడు ఎక్కడికీ వెళ్ళకుండా పెండ్లి కొడుకులా తయారయి కూర్చో రేపు నీవు నాకేం ఉత్తరం రాయనక్ఖర లేదు——

——శారద"

చేసేదేమున్నది

వడివడిగా తయారయి రెడీగా కూర్చున్నాను

అరగంటలోనే మా బాబాయ్ వచ్చాడు 'రెడీనా' అంటూ.

'యస్' అన్నట్లుగా నవ్వాను

"అయితే బయల్దేరు"

టాక్సీ ఎక్కాం ఇద్దరం

తరువాత ఓ పావు గంటలో ఆ టాక్సీ ఓ మేడ ముందు ఆగటం, దాంట్లోంచి దిగుతున్న మమ్మల్ని ఓ పెద్దమనిషి లోపలికి ఆహ్వానిస్తూ ఎదురవటం, ఆ పైన మనుష్యుల హడావుడి పిల్లల పరుగులు కర్టెన్‌ల కదలికలు

సోఫాలో కూర్చున్నాం

అవుదామనుకుంటున్న మా మ గా రు నన్ను అడ్డమైన ప్రశ్నలతో ఉక్కిరి బిక్కిరి చేశారు ఆయన, బాబాయి తెలిసిన వాళ్ళలాగానే నవ్వుకుంటూ మాట్లాడుకుంటున్నారు

ఇప్పటికే ఇద్దరిని చూపించి ఎటూ తేల్చుకోలేని పరిస్థితులలో పడేసిన శారద మహాతల్లి, ఇప్పటి ఈ చూపులతో నన్ను పూర్తిగా అయోమయంలో పడేస్తున్నట్లుగానే భావించాను.

అసలు ఇంతమందిని చూడనేగూడదు చూసిన దగ్గరనుంచీ మనస్సును ఒక వైపుకు లాగటం మహా కష్టం

ఎవరి జీవితం ఎలా వుంటుందో

ఆ యింటి కిటికీలోనుంచి నా ఆలోచనల నడుమ - ఆకాశంలోకి పరుగెత్తే తెల్లటి మబ్బులవంక చూస్తున్నప్పుడు ఇద్దరు అమ్మాయిలు వచ్చి నా ఎదురుగ్గా సోఫాలో కూర్చున్నారు

మైగాడ్!

నాకు కళ్లు తిరిగినమాట వాస్తవమే

సరోజ, రాధా

వాళ్ళిద్దరూ ఒక్కసారే ఇక్కడకు ఎలా వచ్చారో నాకు అర్థంగాని మరో ప్రశ్న

శారదా. నీ గొంతు పిసికేస్తానేవ్ ఇలాంటి వెధవ నాటకాలు ఆడావంటే

కాబోయే మామగారు వాళ్ళిద్దరినీ నాకు పరిచయం చేస్తుంటే ముగ్గురం అమాయకపు మొఖాలతోనే నమస్కారాలు పెట్టుకున్నాం వాళ్ళిద్దరూ ట్విన్స్‌ట అదా సంగతి

శారద నా నెత్తిన మరో కుంపటిని గూడా పెట్టకుండా ఈ నాటకానికి చివరి అంకం నడిపించేస్తున్నందుకు నాకు కించిత్ సంతోషమూ కలిగింది

కాఫీలయినయి మాటల నడుమ యాపిల్ ముక్కలూ అంగూర్‌లు తిన్న తరువాత

మాటల్లో శారద ప్రసక్తి తప్పలేదు

మరోసారి ఆ అమ్మాయి లిద్దరూ ఆ మొండి శిఖండి వాళ్ళకు ఎంత థిక్ ఫ్రండో తెలియబరుచుకున్నారు

ఆయనకు నా నిర్ణయాన్ని రేపటికల్లా

తెలియబరుస్తానని మా బాబాయ్ మాట యిచ్చాడు తరువాత బయటకు వచ్చిన అరగంటకు మా బాబాయ్ నాకు చెప్పింది- 'మిగతా అన్ని విషయాలు సెటిల్ అయి నట్లేనని-పిల్ల ఎవ్వరో మాత్రమే నాకు వదిలివేయబడిందనీను'"

ఇంకా ఐదు నిముషాల్లో ఆ యింట్లో నుంచి టాక్సీలో కాలుపెడుతాం అనగా— వెండి భరిణనిండా పోసిన సుగంధభరిత మైన వక్కపొడిని చిటికెడు తీసుకుని నోట్లో వేసుకొని ఎటూ తేల్చుకోలేని ఆలోచనలలో కొట్టుమిట్టాడుతుండగా— రాధ లోపలనుంచి ఏదో పుస్తకం తెచ్చి నాకిస్తూ "శారద కావాలంటే కొన్నాను, ఎవరైనా గుంటూరు వెళుతుంటే పంపండి!" అన్నది

"అలాగే!" అందుకున్నాను

ఆదేదో సైన్స్ పుస్తకం'

బాబాయి రేపు ఉదయం ఆఫీసుకు వెళ్లే లోగా ఫోన్‌చేసి నా నిర్ణయాన్ని తెలియ బరచాలి. నాకు పన్నెండు గంటలకుపైగా టైం యిస్తూ నన్ను నా గదిలో వదిలేసి ఆయన వెళ్ళిపోయాడు.

గది తలుపు తెరుస్తూంటే నాకో అను మాన మొచ్చింది

దబదబా రాధ యిచ్చిన పుస్తకం పేజీలు తిప్పుతుంటే చేతులు వణికినయ్ కళ్ళు తళుక్కుమన్నయి. నాకు దారి దొరి కింది, నాలోని చిక్కుప్రశ్న లన్నిటికీ సమాధానం దొరికింది నాకు అర్ధంకాని పజిల్‌కు సొల్యూషన్ దొరికింది.

"థాంక్యూ' డియర్ థాంక్యూ'" దాన్లోని చీటీని తీసి ముద్దు పెట్టుకున్నాను,

మనం ప్రేమించేవాళ్ళతోకంటే మనని ప్రేమించేవాళ్ళతోనే జీవితం అందంగా వుంటుంది!

ఆ చీటీలో ఇలా వున్నది

"మీరంటే నాకిష్టం—రాధ!"

నాకూనూ!

*  *  *

రాత్రి పదిగంటలప్పుడు మల్లెపూల పందిరి మంచం మీద రాధను నా ఒళ్ళోకి లాక్కుంటూ, "థాంక్యూ డియర్ " అన్నాను పదిహేను రోజుల క్రితం అను కున్న మాటనే రిపీట్ చేస్తున్నట్లుగా

"ఎందుకు?"

"నాకు అందమైన దారి చూపించి నందుకు?"

"ఏ దారి?"

"ఇదీ " అంటూ అపురూపంగా దాచుకున్న ఆ కాగితాన్ని లాల్చీ జేబులో నుంచి బయటకు లాగి రాధ చేతిలో వుంచాను "శారద కివ్వమంటూ పూల బాట వేశావ్'"

రాధ ఒక్కక్షణం ఆ కాగితంలోకి విచిత్రంగా చూచి, కళ్లు కాంతివంతమవగా అందంగా పెదాలను విరుస్తూ, "థాంక్యూ సరోజా'" అన్నది

"అదేఁవిటి?" ఆత్రంగా అడిగాను

"అది అంతే—థాంక్స్ టూ సరోజ' నాకు తెలియకుండానే అది అలా నా మనసులోని మాటను రాసిపెట్టినందుకు'"

"అంటే'"

నాకర్ధమయిపోయింది'

మైగాడ్'

సరోజ తనకు నేను నచ్చలేదని ఎంత అందంగా చెప్పింది?' ★



## గాంధీ గారి రాజ్యంలో గాంధారి కొడుకులు

# మగాడి జన్మహక్కు

సి.వి. రమణ

రైలు పట్టాలమీద పరిగెడుతోంది—రోడ్డుమీద పరిగేత్తే వీలులేదు కనక నూతన దేశభక్తుడి రాజకీయ జీవితంలా లాభసాటిగా పరిగెడుతోంది రైలు కంట్రాక్టరు గారిచ్చే మందు పార్టీల్లో గాజుల చేతుల్లా కలకల్లాడుతూ పరిగెడుతోంది రైలు

అలా చాలా రకాల నీచోపమానాల్లా మహాస్పీడుగా పరిగెడుతోంది రైలు ఆంధ్ర దేశంలో పరిగెడుతున్న రైలు కాబట్టి ఫస్ట్‌క్లాస్ కూడా ఆఖరి క్లాసులా ఫేమిలీ ప్లానింగ్ వాళ్ళ మాటని పెడచెవిన పెట్టేసినట్టుంది కిక్కిరిసి నే కూర్చున్న బెర్త్ మహా యిరుగ్గా వుంది యిద్దరం సన్నటి మనుషులమైనా, మూడో శాల్తీ ఓ స్త్రీ మూర్తి—కింగ్ కాంగ్‌కి ఆడ మేకప్ వేసినట్టుంది- దారాసింగ్ క్లాస్‌మేట్‌లా వుంది

చంబల్ వేలీలో మాన్‌సింగ్ మురాకు సలహా లిచ్చేదాన్లా—తెలివిగా వుంది ఆమె మొహం యిండియన్ విస్కీ ఫోర్సనుకుంటా—నీరుకమ్మి—నీరుల్లి రేకల్లా వున్నాయి ఆమె కళ్లు

మొద్దుగా—నిర్లక్ష్యంగా—అసహ్యంగా వున్నాయి ఆమె పెదవులు

చాలా వేలు పైచిలుకు ఖరీదు చేసే రవ్వల దుద్దులతో బరువుగా సాగుతున్నాయి ఆమె చెవులు అంట్లు తోమడం వృత్తిగా—పిడకలు చరచడం హాబీగా వున్నట్లున్నాయ్ ఆమె చేతి వేళ్లు

అందమైన చీర ఆమెను ఆయాసంగా చుట్టుకుని—ఆవకాయ కుండని ఫారెన్ ఎక్స్‌పోర్ట్‌కు పార్సెల్ చేసినట్టుంది

మూడున్నర మీటర్ల జాకెట్ గుడ్డ చాలక కావోఁసు టైలర్ ఆమె జాకెట్ మెడని విశాలంగానూ, చేతులు చంకల్లోకీ కుట్టేశాడు

కుడిచేతికి పావు కిలో బంగారంతో చేయబడ్డ గాజులు ఎడం చేతికి కిలో రాయి సైజు రిస్ట్ వాచీ

కుడి చేతి మధ్యవేలికి బుద్ధుడు రావిచెట్టు కింద కూచున్న ఫోజులో ఉంగరం

మెళ్లో శంఖల తావళం అదీ బంగారంతో చుట్టినదే వుంది

ఆమె ఎదురు సీటులో కూచున్న ఓ ఖద్దరు మీసాల రాజుగార్ని వోరకంట చూసింది, ఆయన పది నిమిషాలనించి తననే చూస్తున్న కారణాన .

ఆ చూపుల తాలూకు వోల్టేజికి తట్టుకోలేక ఆయన కిటికీ వేపు మొహం తిప్పేసి చంటి పిల్లాడిలా, పరిగెడుతున్న రైలు కిటికీలోంచి టెలిగ్రాఫ్ స్థంభాలు లెక్కెట్టడం మొదలెట్టాడు

తర్వాత ఆమె నన్ను చూసింది, ఖద్దరు మీసాల రాజావారిని చూసినట్టే

శూర్పణఖ, హిడింబి, తాటకి వగైరా సుందరీమణులు గుర్తు కొచ్చారు నాకు.

కళ్లు మూసుకుని ఓ సారి జ్యోతిలక్ష్మిని తల్చుకుని మరీ చూశాను ఆమె వైపు-ఏ మాత్రం—ఏ విధమైన అభిప్రాయం కలగలేదు నాకు

జై హెలెన్, జై హలం, జై వగైరా సెక్స్ క్వీనుల్ని గుర్తుకు తెచ్చుకుని మరోసారి చూశాను.

సోఫియా లోరెన్, లిజ్ టేలర్ల మీద నేను గత మూడేళ్లుగా పెంచుకున్న ' అలాంటి అభిప్రాయం' కాస్తా హరీమంది

నా అవస్థ చూసి ఆమె నవ్వింది

అర కిలో లంక పుగాకు చుట్టలు అరగంటలో భస్మంచేసే కెపాసిటీ ఆమె పళ్ల మీద కనిపించింది

ఓడిపోయి, తలొంచేసుకుని మూర్ఛపోదామని ప్రయత్నించాను

'ఆ లైఫ్ ఓ సారి యిస్తారా' అనడిగింది ఆమె




కెనెడియన్ యింజన్ కూతే కొంచెం మధురంగా వుంటుంది

వైజాగ్‌లో కొన్న లైఫ్‌ని యిచ్చేసేను నిజంగా నా లైఫ్‌ని యిస్తున్నంత భయంగానూ "థాంక్స్" అంది ఆమె

నా మొహం మీద వర్షం జల్లు కొట్టినట్టయింది జేబు రుమాల్తో మొహం తుడుచుకున్నాను "నో మెన్షన్" అని సాధ్యమైనంత గ్రేస్‌గా అన్నాను లోపలి నీచ భావాలను సముదాయిస్తూ

"ఎక్కడికి వెడుతున్నారు" అంది కలుపుగోలుగా నాతో స్నేహం చెయ్యడానికి తాపత్రయ పడుతున్నట్టుందామె

కేవలం నా పురుష సౌందర్యంతో కాలేజీలో చాలామంది అమ్మాయిల్ని పల్టీ కొట్టించిన నాకు, జీవితంలో మొట్టమొదటిసారిగా నా మొహం మీద అసహ్యం వేసు కొచ్చింది

రైలు ఆగ్గానే దిగేసి చక్రాలకి పూసిన గ్రీజు మొహం నిండా నల్లగా మొత్తుకు వచ్చేద్దా మనిపించింది. రైలాగింది

గ్రీజు విషయం మర్చిపోయి, సిగరెట్లకోసం దిగబోయా

"కాసిని వేడినీళ్లు తెచ్చిస్తారా" అంటూ బాస్కెట్‌లో వున్న ప్లాస్క్ తీసిచ్చింది. కావాలనే తన వేళ్లతో నా వేళ్లు నొక్కింది ఫ్రాక్చర్ కాలేదు ఒక్క వేలు కూడా

ఆ కంపార్ట్‌మెంట్‌లోంచి తొందరగా బయటపడి పారిపోవాలనే తాపత్ర యంతో స్పీడుగా దిగబోయి, కాలు జారి ప్లాట్‌ఫారం మీద కొంత దూరం చాలా వేగంగా ప్రయాణించి ఓ చోట ఆగాను. తత్ఫలితంగా మోకాలిమీద రెండంగుళాల చర్మం టెర్లిన్ ఫేంటుతో సహా చెక్కుకు పోయింది




ఆమె గబగబా కంపార్ట్‌మెంట్ దిగి "అయ్యో, అయ్యో" అనుకుంటూ నన్ను ఆర్నెల్ల చంటి వెధవలా లేవదీసి, కంపార్ట్ మెంటులో చేర వేసి, బాస్కెట్‌లోంచి యార్డ్లీ పౌడర్ తీసి, మోకాలిమీద మొత్తే సింది. ఖరీదైన జేబురుమాల్తో సినిమాటిక్‌గా కట్టుకట్టింది

"అయ్యో నే చచ్చిపోయాను కాదు, నే వేణ్ణీళ్లు అడిగిన మూలాన్నే మీకీ దెబ్బ తగిలింద"ని నుదురు తుడిచి, జుట్టు సవ రించి, మంచిగంధంరేకుల మడత విసినికర్ర తీసి విసరడం మొదలెట్టింది

ఖద్దరు మీసాల రాజుగారూ తదితరులూ ఈ ఫార్సే చూస్తున్నారు

నాకు చాలా అసహ్యంగా వుంది పెట్టి పుచ్చుకు దిగేద్దామా అనిపించింది,

మరో ప్లాస్క్‌లోంచి హార్లిక్స్ కప్‌లోకి వంచి తాగమని బలవంతం పెట్టింది.

అక్కడ వున్నవాళ్లు నన్నే చూస్తున్నారు

అందరి కళ్లలోనూ ఒకటే భావం, ఒకటే భాష 'భలే ఛాన్స్ కొట్టేశావులే'

నాకు చచ్చే సిగ్గుగా వుంది

ఆవిడ మరోసారి హార్లిక్స్ తాగమని హెచ్చరించింది

"వద్దండీ, ప్లీజ్" అన్నా చూస్తున్న ప్రేక్షకుల కోసం.

బలవంతంగా ఆవిడ హార్లిక్స్ కప్ నోటి కందించింది

తాగక తప్పలేదు

తాగకపోతే- కాళ్ల మీద పడుక్కోబెట్టుకొని ఆర్నెల్ల చంటి వెధవకు ఆవుదం పోసే లెవెల్లో వుందామె

రైలు కదిలింది నా మనసులో ఏవేవో భావాలు కదిలాయి

రాజుగారి మీసాలు నన్ను వెక్కిరిస్తున్నట్టు కదిలాయి

యిరుకు సీట్లో ఆమె చేతివేళ్లు, నా నడుంమీద కదిలాయి అవి కాల్చిన అట్ల కాడల్లా వున్నాయి

నాకు నిద్రొచ్చి నట్టయి-మూర్ఛపోదామని ప్రయత్నించి ఓ అయిదు నిమిషాల కాలం చచ్చిపోయాను

"బాబూ! లే" ఆమె చనువుగా భుజం తట్టి లేపింది

ఉలిక్కిపడి కళ్లు తెరిచాను

ఏదో స్టేషను కనుచీకటి నా కంట్లో చీకటి

"అబ్బే చాలా మైనర్ ఆక్సిడెంట్" టింక్చర్ అయొడిన్ వాసన గుప్పుమంది. డాక్టర్ కాలికి కట్టుకట్టాడు

బాగ్‌లోంచి పాతిక రూపాయలు డాక్టర్ కిచ్చి "థాంక్స్! మీకు శ్రమ యిచ్చాను" అంది ఆమె

"అది నా డ్యూటీ, మీరు ముందుగా ఎస్సెమ్‌చేత ఫోన్ చేయించారు కనక, నేను రెడీగా వున్నాను ఈ మాత్రం సిన్సియారిటీ ఈ రోజుల్లో ఎవరికుందండీ"



డాక్టర్‌గారు వెళ్ళిపోయారు

"ఇంకా నిద్రేనా" అన్నది ఆమె

ఇంకో కప్ హార్లిక్స్

కప్పులు కడుక్కు రావడానికి వెళ్ళింది ఆమె

మీసాల రాజుగారు "అదృష్టవంతుడివి, లక్కీఛాన్స్" అన్నారు

"అంటే నా కర్థం కావడంలేదు" అన్నాను

"ఆ అర్థం ఆవిడే చెబుతుందిలే" అని-టాయ్‌లెట్‌నుంచి వస్తున్న ఆవిడ్ని చూసి-పలమారని గొంతు సవరించుకుంటూ ఇందాకటి పొజిషన్లో సెటిలయిపోయాడు టెలిగ్రాఫ్ స్థంభాలు లెక్కెడుతూ

ఆమె సామాన్లన్నీ సర్దింది

రైలు రాజమండ్రిలో ఆగింది ఆమె కూలీని పిల్చింది

నలుగురైదుగురు పెద్ద మనుషులు ఆమె దగ్గర కొచ్చి కూలీకంటే నమ్రతగా సామాన్లు దించేశారు

ఆమె కిందికి దిగుతూ "వస్తా బాబూ" అంది

నేనేం మాట్లాడలేదు ఏమనాలో తోచక-తెలియక-ఆలోచించలేక

"మీ అడ్రస్" అనడిగింది



'ఎడ్రసిస్తే ఎప్పుడొచ్చి పడుతుందోనని' తప్పు పేరు, అడ్రసూ చెప్పాను

"బాబూ! నన్నపార్థం చేసుకోకు ఒక్కగా నొక్క కొడుకు, హార్వర్డ్‌లో చదువుతున్నవాడు, అచ్చం నీలాగే వుంటాడు బుగ్గమీద అచ్చం అక్కడే, అదే పుట్టుమచ్చ కార్ ఏక్సిడెంట్‌లో పోయాడు నా కొడుకు "

ఆమె కళ్ళలో నీళ్ళు

"ఆయన కొడుకుని చూడకుండానే వెళ్ళిపోయారు వాడు నా నుంచి దూరంగా - శాశ్వతంగా వెళ్ళిపోయాడు ఈ అమ్మని మర్చిపోకు బాబూ!"

రైలు రౌద్రంగా కూసింది

ఆమె కన్నీరు చీర చెంగుతో వొత్తుకుంటోంది

రైలు ఓ హూపుతో కదిలింది

నా మెదడులో ఫ్యూజియామా బద్దలైంది

ఓ గంటలో కంపార్ట్‌మెంట్ గుమ్మం దగ్గరకు వచ్చా

ఆ అమ్మనుంచి, నన్నూ, నా నీచత్వాన్ని దూరంగా తీసికెళ్ళిపోతోంది రైలు.

ఆమె దూరంగా - దేవతలా వెళ్ళిపోతోంది



మినీ కథ

# నాకూ ఓ మనసున్నాది

పదిహేడేళ్ళ సత్తిగాడి కళ్ళల్లో ఎర్రటి జీరలున్నాయ్—అవి వాడి గుండెల్లో అల్లరిచేస్తున్న కోర్కెకు సంబంధించినవి, ఆ కోర్కెలో విహరిస్తున్నది సుబ్బులు

* * *

సుబ్బులుకి గ్లామరుంది గ్లామర్ని అమ్ముకునే ధైర్యం వుంది, అవసరం కూడా వుంది ఆమె ఒంటి వంపులమీద వాతలున్నాయి ఆ వాతలకీ, పోలీసోళ్ళ లాఠీలకి చుట్టరికం వుంది

సత్తిగాడికి వాళ్ళమ్మెవరో తెలీదు వాడి నాన్నెక్కడున్నాడో, వాడికే కాదు, వాళ్ళమ్మకి కూడా తెలీదు సత్తిగాడ్ని అందరూ ఇంగ్లీషులో 'బ్రోకర'ని పిలుస్తారు ఇంగ్లీషు మాటలు నోరుతిరక్క, మరే కారణం చేతో 'సత్తెం' అని ఆప్యాయంగా పిలుస్తుంది సుబ్బులు అలా పిలిచి తను తిన్నా, తినకపోయినా వాడి కింత తిండి పెడుతుంది

బయట, సుబ్బులు పాక చూరు క్రింద రాత్రిళ్ళు గడిపే సత్తిగాడికి, లోపల గుసగుసలూ, ఫికఫికలూ, పకపకలూ మొన్న మొన్నటి వరకూ చిరాకుని కలిగించేవి ఈ మధ్య వాడిని కదిలించటం ప్రారంభించాయి సత్తిగాడికి సుబ్బులు పెద కోర్కె, ఎదుగుతున్న వాడి యవ్వనంలా పెరిగిపోయింది

* * *

తన కోర్కె బైట పెడితే సుబ్బు లేమంటుందోనని క్షణంలో సగంసేపు ఆలోచించాడు "అదేమీ పతివ్రత కాదు కనీసం సంసారన్నా కాదు" కానీ అడగాలంటే ఎందుకో భయమనిపించింది సత్తిగాడికి

వాడి భయాన్ని కోర్కె మింగేసింది. దేశాన్ని అప్పుడే చీకటి మింగబోతోంది తడబడుతున్న కాళ్ళతో, దడదడలాడుతున్న గుండెల్తో సుబ్బులు దగ్గరగా వెళ్ళేడు "నువ్వు కావాలే" అన్న వాడి మాటల్ని పూర్తి చెయ్యనివ్వలేదు సుబ్బులు

"నా కిట్టంలేదు" అంది

సత్తిగాడు నవ్వేడు, "నీకూ ఇట్టా ఇట్టాలేందే పతివ్రాత ననుకుంటన్నావా" సుబ్బులు బుజాల్ని పట్టుకున్నాడు గట్టిగా, "నేను కూడా డబ్బిత్తానే"

సత్తిగాడి చెంప పగిలిపోయింది

సుబ్బులు అరచేయి కందిపోయింది!

గొంతు కంపించింది, "రేయ్ నేను పతివ్రాతని కాదురా అట్లాగని సెప్పి నా కిష్టంలేని పని సెయ్యను 'సానిది దీనికి ఇట్టాఇట్టాలేంది' అని నవ్వమాక సెప్తున్నా ఇను నాకూ కలలూ. కన్నీళ్ళూ వున్నాయ్రా" అంటూ వాడ్ని గుండెల కదుముకుంది శపించాల్సిన నోటితో నుదిటిమీద ముద్దెట్టుకుంది "నేను నీ క్కావల్రా సన్నాసీ నేను నీకు రోజూ అన్నం పెడతన్నాను- నాకు బిడ్డుంటే నీ వయసులో వుండేవోడు లేడు కనక ఆ 'ఇది' తీర్చుకుంటున్నాను"

సుబ్బులు గొంతు పగిలిపోతుందేమో ననిపించింది సత్తిగాడికి

"ఎట్రా సూత్తన్నావ్ అరదం కాలేదా అందుకేనా నాకు డబ్బిత్తానని కూసేవ్ ఒరేయ్ నేను నీకమ్మనురా."

సత్తిగాడు మాట్లాడలేదు.

మాట్లాడితే సుబ్బులు బ్రతకదు.

— మాడభూషి దివాకర్.

# మిస్టర్ సంపత్ ఎం.ఏ

మాదిరెడ్డి సులోచన

## జరిగిన కథ

ఆదర్శాలకూ, అవసరాలకూ జరుగుతున్న పోరాటంలో అవసరాలదే పైచేయి అని భావించక తప్పని పరిస్థితులలో చిక్కుకున్నాడు సంపత్ కుమార్. ప్రేమించిన సునీతి అపార్థం చేసుకుంది. సునీతి తండ్రి శివరాజు గారి బాకీ వెంటనే కట్టవలసి వచ్చింది. తల్లి అనారోగ్యం ఆందోళన కలిగిస్తూంది. న్యాయమార్గాన సంపాదన కోసం ప్రయత్నించి పరాజితుడవుతున్నాడు సంపత్. శివరాజుగారు పక్షవాతంతో మంచాన పడ్డారు. ఆయన కుటుంబం హఠాత్తుగా సంక్షోభానికి లోనైంది.

"ఏమిటమ్మా' నాన్నగారికి తెలిస్తే మరింత బాధ పడతారు, వూరుకో"

"రేపయినా తెలియదా?" అన్నది నీరసంగా,

"ఎవరే సునీతీ యెవరమ్మా'" శివరాజు కేకలు వినిపించాయి సునీతి వెళ్ళి చెప్పింది

"అదేం? లోపలికి రాలేదు ఆఁ" అతను అతి కష్టంమీద ఒక ప్రక్కకు తిరుగగలిగినాడు

"పోనీలే నాన్నా' అతను మనల్ని చూడాలని రాలేదు మన ఆస్తి వివరాలు కనుక్కొని తన కూతురికిచ్చిన కట్నము వివరాల కోసము వచ్చాడు"

"అమ్మా' "

"పోనీలే నాన్నా, మీరేం బాధపడకండి అమ్మ నగలు, నావి కలిపితే పదిహేను వేలు చేస్తాయి"

"ఊఁ అంతా ఆ దైవేచ్ఛ విషయము చెబుతున్నాను" అతను కళ్ళు మూసుకున్నాడు

కాలము కాటుకు గురికాని మనుషులు అరుదుగా కనిపిస్తారేమో సునీతికి వయసుకి మించిన అనుభవము అవుతుంది

"రాముడికి పెరుగు గారెలంటే ఇష్టమే అమ్మాయ్ పప్పునానబోస్తే రేపు ఉదయానికి చేసుకోవచ్చు" సావిత్రమ్మ హడావుడిగా డబ్బాలు సర్దడము చూచి జాలిగా

రవ్వింది సునీతి

"అమ్మా! అన్నయ్యా మనింటికి వస్తాడనే అనుకుంటున్నావా?"

"ఎందుకు రాడే?"

"ఎందుకు అన్న ప్రశ్నకు నా వద్ద జవాబు లేదు"

"నీకు మతి పోయింది పూర్కో—" కసిరింది సునీతి తల్లితో వాదించి లాభం లేదని పూరుకుంది మూడు గంటలు కాగానే చక్కగా ముస్తాబయి పాట్నీకి వెళ్ళింది పాట్నీలో కంపని వెతుక్కునే సరకు నాల్గు గంటలయింది ఇంటర్వ్యూకు వెళ్ళింది, ఒకరిద్దరు ఆంగ్లోఇండియన్స్ తప్ప చాలా మంది అభ్యర్థులు లేరు తన వర్న్ రాగానే వెళ్ళింది

"టేక్ యువర్ సిట్" ఆదరంగా చూపాడు ఆ తరువాత అతను అడిగే ప్రశ్నలకు వీలయినంతవరకు జవాబు చెప్పింది

"థాంక్యూ మిస్ సునీతి మీ ఇంటికి పంపుతాము ఉత్తరువు"

"మెని, మెనీ థాంక్స్ సర్" ఆమె ఇంటికి వచ్చింది అతడు మాట్లాడిన తీరు చూస్తే చాలా ఆశాజనకంగా కనిపించింది

మర్నాడు సావిత్రమ్మ వంట చేసి కొడుకు రాకకై యెదురు చూస్తూ కూర్చుంది అతను పన్నెండు దాటిన తరువాత ఓ బంధువులా మామగారితో వచ్చాడు తండ్రిని పరామర్శించాడు తల్లి, చెల్లి, తమ్ముడిని పలుకరించాడు

"ఇన్నాళ్ళకు చూడాలనిపించిందరా తండ్రీ నువ్వు లేని లోటు ఎంతగా కనిపించిందో" తల్లి కంట తడి పెట్టకుంది

"ఇంకా ఇల్లు, ఇల్లు అని కూర్చుంటే పైకి వచ్చేదెలాగమ్మా? ఇప్పుడేమైంది!" అన్నాడు తాపీగా

"సరే భోజనానికి లేరా" హడావుడిగా బల్ల సర్దసాగింది

"అమ్మా! నువ్విప్పుడేం హడావుడి పడకు ఆంటి వంట చేయిస్తుంది నాన్న గారు మాటాడే స్థితిలో లేరు నువ్వు కూర్చుని నేను అడిగే ప్రశ్నలకు జవాబులు చెప్పాలి" అన్నాడు, తల్లి వెను కాలే వచ్చి వంటింటి గుమ్మము పట్టుకుని నిల్చుంటూ—

"అంత విలువయిన ప్రశ్న లేమిటో అడగరా" అన్నది ఆమెకు దుఃఖము పొంగుకు వస్తుంది

"ఇప్పుడు క్యాష్ ఏమీ లేనట్టా?"

"లేదు అందుకే మొన్న కొంత బంగారము అమ్మాము"

"ఊఁ నా కిచ్చిన పదిహేను వేలు కావాలంటున్నారు మామగారు"

"మామగారి సంగతి సరే నువ్వేమంటున్నావో చెప్పన్నయ్యా?" సునీతి అడిగింది

"యెన్నటికయినా వాళ్ళదే కదా

"నేనిస్తానురా"

"సునీ"

"అమ్మా' మమతానురాగాలు లేక పోయాక ప్రాణం లేని నగల కోసం యెందుకమ్మా పాకులాట అవి పెట్టి నా వివాహము చేయాలని నీ ఉద్దేశం కాని నేను మాత్రం అందుకు అంగీకరించను" ఆమె వెనుకాలే వెళ్ళాడు నగల పెట్టె ఇచ్చి వివరాలు చెప్పింది

"పది శాతం తరుగుపోతుందని, ఆ బాపతు కూడా పెట్టాను ఇక అమ్మను ఎక్కువగా ఇబ్బంది పెట్టకు. ఇంటి బాధ్యత స్వీకరిస్తానంటే భాగం పంచుకో, లేదా తమ్ముడు నీ అంతవాడు అయ్యేవరకు ఇంటి గురించి మరిచిపో" నిక్కచ్చిగా చెప్పే చెల్లిని ఆశ్చర్యంగా చూచాడు వాదించినా, లాయరుని సంప్రదించినా లాభం లేదని తెలుసు అది శివరాజుగారి స్వార్జితము అందుకే అందిన నగలు పట్టుకుని అత్తగారింటికి వెళ్ళిపోతూ, ఏద యినా అవసరము వస్తే ఉత్తరము వ్రాయ మని చెప్పి మరీ వెళ్ళిపోయాడు రాము ఒక్కడే కాదు గారాబంగా పెరిగిన కొడుకులంతా యింతే ఒక్కసారి కర్తవ్యం గురించిగాని, కుటుంబము గురించిగాని ఆలోచించరు

"అన్ని బంధాలు తెంచుకునిపోయాడే" శోకం తీసింది సావిత్రమ్మ

"ఇప్పుడేం చేస్తానంటావు?" కసిరి నట్టుగా అడిగింది

"అది కాదే, వాడిని చదివించి ఇంత వాడిని చేసింది ఎందుకు?"

"ఎందుకో చూపించి వెళ్లాడుగా అమ్మా, తెగిపోయే బంధాల కోసము ప్రాకులాడటం మానేస్తేనే అందరము సుఖపడతాము" కూతురు హృదయపూర్వ కంగా ఆ మాట అనటం లేదని, బాధ బయటికి క్రక్కలేక బంధనాలు తెంచ మంటుందని అర్థం చేసుకుంది ఆమె కూతుర్ని దగ్గరగా తీసుకుని మరోసారి కంట తడి పెట్టింది 'నా తల్లీ' అనుకుంది

"ఏమిటమ్మా! పద ఆకలేస్తుంది"

"నువ్వు మొగపిల్లవాడివయితే ఎంత బావుండేదే సునీతీ"

"మొగపిల్లవాడయితేనే ఇంటి బాధ్యత స్వీకరిస్తాడా? అమ్మా నీ ఏడ్పులు, అంగ లార్పులు విని తమ్ముడు దిగులుపడుతు న్నాడు నాకు ఉద్యోగం రాగానే వాడిని హాస్టల్లో వుంచుదాము"

"అనితకు ఒక్క ఉత్తరం రాయవే అమ్మా"

"అమెరికాలో ఉన్న అక్కయ్యను క్షోభ పెడితేగాని మన కష్టాలు తీరవా ఏం?"

"ఏమిటో నా తాపత్రయము నాది దాని చిన్నత్త కొడుకు అమెరికా వెళ్ళాడట"

"అతనికి నన్ను ఇద్దామనే అమ్మా, మన పరిస్థితులు చక్కబడనీ, వారం, వారం ఫారిన్ వెళ్లేవాడిని చేసుకుంటాను సరా!" నవ్వింది సునీతి ఆనవ్వు నవ్వులా లేదు ఆమె భర్త పిలపటంతో వెళ్ళి పోయింది సునీతి మెల్లగా కిటికీ దగ్గరకు వెళ్లింది మామిడి కొమ్మమీద రెండు పక్షులు కిల కిల మంటున్నాయి ఏం బాసలు చేసుకుంటున్నాయో! 'ఇంత నిరాశ, నీరసమైన పరిస్థితుల్లో నీ చల్లని స్నేహము నాలో జీవము పోసింది నీ ఊహ మాత్రం చాలు నాలోని ప్రతి రక్త

టెలివిజన్ కొనిచూడు!






మద్రాసు టి. విలో ప్రతి శనివారం సాయంత్రం 6-30 నుండీ 10 గం॥ వరకూ సినిమా చూపిస్తారు!

---

బిందువు వుప్పొంగిపోతుంది ఆ మధుర బాసలు ఏమయ్యాయి? కాలం ఒరిపిడిలో కరిగిపోయాయా?' ఆమెలోని ప్రతి అణువు 'సంపత్ సంపత్' అని అరుస్తున్నట్టు అనుభూతి చెందింది

"అమ్మాయ్ వీళ్ళు ఇల్లు చూస్తారట " ప్రక్కింటామె కంఠం వినిపించింది వాస్తవము గ్రహించేసరికి ఆమె ప్రతి అణువు సంపత్‌ను అసహ్యించుకో సాగింది

"రండి ప్లీజ్ " పిలిచింది కళ్ళు తుడుచుకుని

"కరంటు, నీళ్ళు అన్నీ మాట్లాడుకోవే అమ్మాయి" అన్నది మెల్లగా వచ్చిన దంపతులు ఇల్లంతా తిరిగిచూచారు.

"వండర్‌ఫుల్ హౌసండీ వంక పెట్టే పనే లేదు ఇలాంటి ఇల్లుకోసమే వెతుకుతున్నాము అన్నట్టు చెప్పలేదు కదూ నా పేరు సూర్యకాంత్, మై మిసెస్ ఉష " పరిచయాలు అయ్యాయి అద్దె, కరంటు విషయాలు మాట్లాడారు

"మీరుండేది నల్గురా పైన' మేమూ అంతేనండీ మే మిద్దరము మాకిద్దరు అఫ్‌కోర్స్ సర్వెంటుంది నేను ఈ పని వారిపై ఆధారపడటం అన్న ఊహే హేట్ చేస్తాను మన పనులు మనము చేసుకోవాలి ఏమంటారు? అమెరికాలో అంతేనండీ "

"అవును మా సిస్టర్ రాస్తుంది "

"మీ సిస్టర్ అమెరికాలో వుందా? విచ్

ప్లేస్ " ఉత్సాహంగా అడిగాడు

"స్కోకీలో ఉంటుంది "

"అయితే ఈసారి వెడితే తప్పక మాట్లాడతాను లెండి "

"కాంత్ అడ్వాన్స్ ఇచ్చేయి వెడదాము" భార్య వాచి చూసుకుంది

వాళ్ళు అడ్వాన్స్ ఇచ్చారు మొదటి తేదీకి వచ్చి చేరుతామని చెప్పి వెళ్లారు సునీతికీ ఏదో ఆధారం దొరికినట్టు, తనదో సమస్య తీరినట్టు ఫీలయింది మెల్లగా సామాన్లు పైకి మోయడం, అమ్మాలను కున్నవి ఓ ప్రక్కన పెట్టింది ఆమెకు ఒక్కొక్క సామాను తీస్తుంటే, అవి కొన్నప్పటి సంఘటనలు గుర్తుకు రాసాగేయి బలవంతంగా ఆ ఆలోచనల నుండి దూరము పోవాలని, పని ప్రక్కన పెట్టి ఏదో నవల తీసుకుంది

"నేను మాట్లాడిన ప్రతీ మాటా నీకు కవితలా వినిపిస్తుందన్నమాట " చిరునవ్వుతో ప్రశ్నించే అందమైన ఆకర్షణీయమైన ముఖం ప్రశ్నించింది వెంటనే నవల గిరాటువేసి కళ్ళు మూసుకుంది.

## 17

"గుడ్ మార్నింగ్ సర్."

"ఓ సంపత్. కమాన్ మై బోయ్ కమాన్ మీది మా అదే అమ్మ యెలా ఉంది?"

"అలాగే ఉంది సర్ వేరే డాక్టర్‌కు చూపాను."

"షి విల్ బి ఆల్ రైట్ డోంట్ వర్రీ" అతను చూస్తున్న పైలు ప్రక్కన పెట్టి లేచాడు చనువుగా సంపత్ భుజాలపై చేతులు వేశాడు

"బ్రేక్‌ఫాస్ట్ తీసుకుందాం పద "

ఇద్దరూ లోపలికి వెళ్ళారు దేవేంద్ర భవనము అంటే ఇదే కాబోలు అనుకున్నాడు ఆ ఇల్లును చూచి. డైనింగ్‌హాల్లో అడుగు పెట్టడానికి క్షణం తటపటాయించాడు తెల్లని కార్పెట్టు మీద లతలు, తీగెలు పరిచినట్టుంది వాటి రంగు ఆలివ్ గ్రీన్‌తో అందంగాఉంది తెల్లని పెయింట్ వేసిన ఇనుప చట్రంపై గాజు బిగించి ఉంది చుట్టూ అందమైన కుర్చీలున్నాయి తెల్లని డెకలామ్‌తో చేసిన సైడు బోర్డులో అందమైన క్రాకరి తళ తళ మెరుస్తుంది ఒకచోట కబర్డ్‌లా కనిపించింది. దాంట్లో వాష్ చేసిన టవల్స్ ఉన్నాయి ఎక్కడా దుమ్ము, ధూళి ఛాయలు లేవు ప్రతిచోటు నీటుగా, శుభ్రంగా ఉంది

"కమాన్ " అస్తానా వెనుదిరిగి చూచాడు తన కాళ్ళ వంక ఒకసారిచూచి బూట్లు విప్పుకోబోయాడు.

"ఫరవాలేదుభయి రా వ్యాక్యూమ్ క్లీనరుంది దుమ్ముపడ్డా శుభ్రము చేస్తుంది" అన్నాడు ఇద్దరు వెళ్ళి కూర్చున్నారు. తెల్లని యూనిఫామ్‌లో ఉన్న బట్లరు వచ్చాడు

"టోస్ట్ ఆమ్లెట్టు ఫ్రూట్ జూస్ నీకు?"

సంపత్‌కు నవ్వు వచ్చింది అసలు ఆహారమంటూ ఏదయినా దొరికితే చాలు అనుకొనే స్థితిలో ఉన్నాడు తాను

"ప్రతిదానికి ఆలోచించడం అంత మంచిదికాదు భయి" అన్నాడు

"మీరేది తీసుకుంటారో అదే చాలు" అన్నాడు




"మేమ్‌సాబ్ లేచిందా?"

"స్నానము చేస్తున్నారు" చిలుకలా పలికి అతను లోపలికి వెళ్ళిపోయాడు అస్తానా ప్రక్కనే ఉన్న టెలిఫోన్ డయల్ చేశాడు

"కమాన్ డార్లిగ్ అతను వచ్చాడు" అని ఫోన్ పెట్టేశాడు

"సంపత్! ఈ రోజు నుండి మనకు కాస్త పని ఉంటుంది నీ బుద్ధి కుశలతను బట్టి నీకిచ్చే అడ్వాన్సు గురించి ఆలోచిస్తాను"

"పనేమిటో చెప్పండి"

"కొందరు స్త్రీలున్నారు' వారికి కావలసినంత ధనముంది సంపాదించిపెట్టే మొగుళ్ళున్నారు ఆ మొగుళ్లకు వీరి అవసరాలు చూచే తీరికలేదు వీరికి కో అంటే కోటిమంది దొరుకుతారు గాని కంటికి నచ్చినవారు మాత్రం దొరకరు, వారిని తృప్తి పరచాలి"

"అదో రకమైన ప్రాస్టిట్యూషన్, అవునా?"

"నువ్వు యెలా అనుకున్నా సరే"

అతని మాట పూర్తికాక పూర్వమే మత్తెక్కించే లవెండరు సువాసనలు, ఆ వెనుకాల మాక్సీ వేసుకున్న ఒక యువతి వచ్చారు

"షి ఈజ్ సరిత సరితా మిస్టర్ సంపత్" పరిచయాలు చేశాడు

"గ్లాడ్ టు మీట్ యు" ఆమె చేయి చాపింది.

"నమస్తే"

"సంపత్' ఏ నమస్తే కో హమ్ నయి సమజతే యు మస్ట్ ఛేంజ్ మాన్,"

"అతను మారి తీరుతాడు" కిల కిల నవ్వి జుట్టును వెనక్కి తోసింది మెల్లగా వెనక్కు వచ్చి, సంపత్ భుజాలమీద తన

మోచేతులు ఆన్చి, అతని తల మీద గడ్డం ఆన్చింది. ఆమె వక్షోజాల స్పర్శ అతనికి జుగుప్స కలిగించసాగింది.

"మారక్కపోయినా నువ్వు మారు స్తావు" అస్తానా నవ్వాడు సంపత్ తల విదిలించాలనుకున్నాడు కాని ఇందాక అతనుచేసిన హెచ్చరిక గుర్తుకువచ్చింది వెనక్కి తిరిగి కన్ను కొట్టాడు

"యూ నాటీ " ఆమె మరింత హత్తుకుంది అతడిని

"ఎక్స్యూజ్ మి సర్!" ఇందాక వచ్చిన నౌకరు చిన్న ట్రాలీ త్రోసుకుంటూ వచ్చాడు

"సరితా! ప్లీజ్ సిట్ డౌన్ " అన్నాడు అధికారపూర్వకంగా ఆమె అతన్ని కసిగా త్రోసినంతపని చేసి వెళ్ళి కూర్చుంది ముగ్గురు పళ్ళ రసము త్రాగారు నౌకరు వచ్చి నాప్కిన్లు వారి ఒడిలో పరిచి, మూడు ప్లేట్లు ముగ్గురి ముందుంచాడు

"ఏమిటిది?" సరిత గద్దించినట్టు అడిగింది.

"మీరు టోస్ట్ బ్రౌన్గా ఉండా లంటారు "

"గెటవుట్ " టోస్ట్ అతని మీదికి విసిరినంత పని చేసింది సంపత్కు బాధగా ఉంది

"ఊఁ అన్నీ తీసుకుపో "

"అక్కరలేదు నా కిలాగే ఇష్టం" అన్నాడు మన దేశములో సగము ఆహార సమస్య ఇలాంటి వారి వల్లే వస్తుంది. మళ్ళీ టోస్ట్ తెచ్చాడు అస్తానా టోస్ట్కు వెన్న రాశాడు. దానిపై గుడ్డు స్లైసులు పెట్టాడు మొదట సరితకు అందించాడు

"థాంక్యూ " అని సుతారంగా దాన్ని కొరికింది సంపత్ అదేం గమనించనట్టు తన టోస్ట్ తనే తిన్నాడు

"ఒబ్బాయ్ మానర్స్ తెలియవూ?"

"కొత్త కదా ఏం భయి" కన్ను గీటి నవ్వాడు అస్తానా

ముగ్గురు ఫలహారము చేశారు తరువాత కాఫీ వచ్చింది సరిత ఒక్కొక్క సిప్ అతని కప్పులోది త్రాగుతున్నా, సంపత్ పట్టించుకోలేదు

"దర్జీవాడు వచ్చాడయ్యా " బయటి నుండి మాలి వచ్చి చెప్పాడు

"బయట కూర్చోబెట్టు సరితా డ్రస్ అప్ " ఆమె వెళ్ళిపోయింది

"సంపత్ కాఫీ సరితకు ఆఫర్ చెయ్యలేదేమిటి?"

"ఆమె మీ మిసెస్"

పకపకా ఇంటికప్పు యెగిరిపోయేలా నవ్వాడు

"వైఫ్ అయితే, నా వైఫ్ అనుకున్నావా?" సూటిగా సంపత్ వంక చూచాడు

"ఇదంతా టెంపరరీ అరేంజ్మెంటు గుర్తుందా?"

"ఊఁ " ఇద్దరూ బయటికి వచ్చారు డన్హిల్ సిగరెట్టు ప్యాకెట్టు తీశాడు ఒకటి తను వెలిగించుకుని రెండవది సంపత్కి ఆఫర్ చేశాడు

"నో థాంక్స్"

"ఇన్నోసెంట్ డార్లింగ్ " నవ్వి అతను వెలిగించుకున్నాడు. దర్జీవాడు రక




రకాల బట్టలుతెచ్చాడు అన్నీ సంపత్‌వే సంపత్ ప్రక్క గదిలోకి వెళ్ళి ఫిట్టింగ్ చూచుకుంటుండగా ఫోన్ వచ్చింది అస్తానా ఆదరా బాదరాగా వెళ్ళాడు ఫోన్ రిసీవ్ చేసుకుని మళ్ళీ వచ్చాడు గదిలోకి

"సంపత్ హరీయప్' ఆ సన్న, తెల్ల పైజామా గ్రే కలర్ కాశ్మీర్ లాల్చీ తీసుకో బట్టలు బాయ్ సర్దుతాడు."

అవి తీసుకుని అతని వెనుకాల నడిచాడు అతని డ్రస్సింగ్ టేబుల్ మీద రక, రకాల అలంకార వస్తువులున్నాయి.

"డ్రస్ అప్ ఈ పింక్ కలర్ గ్లాసున్న జోడు కళ్ళకు తగిలించుకో త్వరగా మన పట్టణంలోకెల్ల ధనవంతురాలు వస్తుంది ఆమెను బుట్టలో వేసే మొగాడు లేడు ఈ నాటికి "

"అదంతా నాకు వదిలేయండి మొగ, ఆడ యెవరయినా వేట కుక్కల్లా వెంట బడితే అసహ్యించుకుంటారు అసహ్యించుకుంటే వెంటబడతారు " అని, బట్టలు మార్చాడు నిలువుటద్దం ముందు నిలబడితే తన రూపము తనకే కొత్తగా కనిపించసాగింది అస్తానా వచ్చి అతడిని చూచి, స్ప్రే తీసుకుని అతని మెడచుట్టూ స్ప్రే చేశాడు అతని లాల్చీ గుండీలు రెండు తీసి వదిలాడు

"గుడ్ "

"సర్ నే నడిగిన అడ్వాన్స్ సంగతి ఆలోచించారా' నా మాట పోతుంది "

"ఇది లాస్ట్ టెస్ట్ రేపు పట్టుకెళ్ళువు గాని " అతని మాట పూర్తి కాక మునుపే కాలింగ్ బెల్ మ్రోగింది అస్తానా కంగారుగా బయటి గదిలోకి వెడుతూ డ్రాయింగ్ రూమ్‌లో ఉండమని సైగ చేశాడు సంపత్ మరొకసారి నిలువుటద్దంలో తన ప్రతిబింబము చూచుకుని మెల్లిగా డ్రాయింగ్ రూమ్‌లోకి

వచ్చి, స్టైలుగా కుర్చీలో కూర్చున్నాడు అతను పైకి చూచాడు సీలింగ్ ఫ్యాన్ తిరుగుతుంది. ఆలోచనలు అతని మస్తిష్కములో తిరుగుతున్నాయి తనేమైనా ఫరవాలేదు రుణ విముక్తుడు అవుతాడు తను ఏం ఉద్యోగం చేస్తున్నాడు తల్లికి తెలిస్తే క్షోభతో ప్రాణం వదిలేస్తుంది

"ఒబ్బాయ్! హాండ్‌సమ్‌గయ్ "

తల యెత్తి చూచాడు సంపత్ గున్న ఏనుగులాంటి స్త్రీ నిల్చుంది గుమ్మములో ఆమెతో వినయంగా ఏదో చెబుతున్నాడు అస్తానా! సంపత్ ఒళ్లు జలదరించింది ఆమె వేసుకున్న పల్చని దుస్తుల్లోనుండి శరీరము బయటికి కనిపిస్తుంది చాలీ చాలని గుడ్డతో మూట కడితే బయటికి వచ్చిన వస్తువుల్లా చేతులు దగ్గర, నడుము దగ్గర కండరాలు బయటికి వచ్చాయి ఆమె వచ్చి అతని ఒడిలో వాలిపోయేదే కాని సంపత్ సింగిల్ చైర్లో కూర్చున్నాడు అసహాయంగా అస్తానా వంక చూచింది

"సంపత్! ఇలా వచ్చి కూర్చో " డబుల్ సోఫా చూపాడు

"ఊం " అతను తీక్షణంగా తన బాస్ వంక చూశాడు 'ఆమె విషయమేమిటో, నేను డీల్ చేస్తాను' అన్నట్టున్నాయి ఆ చూపులు అస్తానా వెళ్ళిపోయాడు

"కమాన్ డార్లింగ్ " ఆ స్త్రీ వయ్యారంగా సోఫాలో చేరబడింది

సంపత్ చిన్నగా నవ్వాడు

"మీరేం భోజనం చేస్తారు"

"ఎందుకు" ఆమె పమిట ప్రక్కకు జార్చి అడిగింది

"అదే యెన్ని కెలోరీలు అధికంగా తీసుకుంటారో నని ఐ పిటీ యువర్ హస్బెండ్ "

"యు యు నాటీ " ఆమె లేచి సంపత్ పైకి చేయి లేపింది ఆ చేతిని పట్టుకుని అలాగే వెనక్కు నెట్టాడు

"ఓబ్బాయ్ అంతా మోటు సరసము" ఆవిడ కిలాంటివి లెక్కలేనట్టు నవ్వింది గదంతా మత్తెక్కించే సువాసనలు అలముకున్నాయి. అతనికి మత్తు యెక్కటం లేదు ఒక విధమైన వికారము కల్గుతుంది

"మీకు ఏదయినా డ్రింకు "

"అబ్బ! ఇప్పటికయినా నా విషయము గుర్తుకు వచ్చినందుకు సంతోషం!" ఆవిడ చేయి చాపి అతని చేయి పట్టుకుంది

అతను చేయి విడిపించుకుని ప్రక్క స్టూల్ మీదున్న బెల్ నొక్కాడు ఇంతలో అతని కళ్ళు అప్రయత్నంగా యెదురుగా ఉన్న ఒక గ్లాసు పలకమీదికి మళ్ళాయి. అక్కడ రెండు జతల కళ్ళున్నాయి. అతనికి అర్థం అయింది ఇదో రకము వ్యాపారము అదో రకము స్వభావము. ఇతరులు రతి జరుపుతుండగా చూచి ఆనందిస్తారు కాబోలు అతను అలాగే చుట్టూ చూచాడు, నాల్గువైపులా అలాంటి అద్దాలే ఉన్నాయి

"కమాన్ డాలింగ్ " ఆమె బలవంతంగా అతన్ని ప్రక్క గదిలోకి లాగింది వారు గది దాటుతుండగా నౌకరు






వచ్చాడు

"స్ట్రాంగ్ డ్రింక్ " ఆవిడ ఆర్డరు జారీ చేసింది ఇద్దరూ గదిలోకి వెళ్ళారు సింహపు బోనులోకి వెళ్ళిన మేక పిల్లలా ఉంది రసికుడయిన మొగవా డెవడయినా ఆ గది అలంకారము చూస్తూనే మూర్ఛపోవాలి విదేశీ సుందరీమణుల నగ్న చిత్రాలు నలుమూలలా వేళ్ళాడదీశారు సంపత్‌కు జుగుప్స కల్గింది. అప్రయత్నంగా అతని కళ్ళు పైకి వెళ్ళాయి మూడు, మూడడుగులకు ఓ అందమైన ఆకు పచ్చ పరదా - రెండు అడుగుల పొడవు, ఒక అడుగు యెత్తు గలవి వ్రేళ్ళాడుతున్నాయి అతనికి అర్థం అయింది అవి అన్నీ బయటివారు లోపలి దృశ్యాలు చూడటానికి అమర్చారని ఆ పరదాలు లోపలివారే ఇష్ట పూర్వకంగా తొలగిస్తారా అర్థం కాలేదు గదిలో పెద్ద బల్బ్ ఆరిపోయింది పచ్చని బల్బ్ వెలిగింది

"ఓ యు ఆర్ ఎ డెవిల్ "ఆమె అంటూ ముందుకు వచ్చింది

సంపత్‌కు మెరుపులాంటి ఆలోచన వచ్చింది

"ఉష్'" సుతారంగా ఆమెను దగ్గరగా లాక్కున్నాడు ఆమె పరవశించి పోయింది

"మన కార్యకలాపాలు మన వరకే పరిమితం కావాలి అదిగో ఆ చిన్న కిటికీలు చూడు బయటివారు చూస్తున్నారు" అతని మాట పూర్తి కాక పూర్వమే సన్నని చిరుగంట మ్రోగింది. ఆ పరదాలన్నీ తొలగిపోయాయి

"ఆఁ ఏమిటిది,"

"ఫ్రీ షో, " ఇద్దరూ వాటిని ఆశ్చర్యంగా చూచారు నౌకరు డ్రింక్స్ పట్టుకువచ్చి బల్లమీదపెట్టి వెళ్ళిపోయాడు

"ఇప్పుడే ఆ డమ్మీగాడిని పిలుస్తాను "

"ఇలాంటి వారితో ఘర్షణ పడితే మీకే నష్టం మనమే బయటికి వెడదాం "

"ఎక్సలెంటు అయిడియా ఈ రోజు సాయంత్రము " అతని కళ్ళల్లోకి చూచి కొంటెగా నవ్వింది సంపత్ అందంగా నవ్వి గ్లాసు ఆమె నోటికి అందించాడు రెండు గ్లాసులు ఖాళీ అయ్యాయి. ఇద్దరు బయటికి వచ్చారు అస్తానా కంగారుగా ఆమెకు యెదురు వచ్చాడు

"మేము సాయంత్రము బయటికి వెడలాం మిస్టర్ అస్తానా, మీకేమయినా అబ్జెక్షనా"

"నో మిసెస్ వర్మ రాత్రికి మన ఫ్రెండ్స్ క్లబ్‌లో కొత్త ఫిల్మ్ స్క్రీన్ చెయ్యాలని "

"ఈజ్ ఇట్ ఆ డర్టీ బిచ్ సీత వస్తుందా?"

"నేనయితే ఫోన్ చేశాను. షి ఈజ్ ఇన్ డిస్టర్బ్‌డ్ కండిషన్"

"పెద్ద పతివ్రత పోజు అది ఎవడో హాండ్‌సమ్ ట్యూషన్ మాస్టార్ని పట్టిందటగా"

"ఈ విధేయుడు పిడిపించి మీ ముందు పెట్టాడు. ఆ హాండ్‌సమ్ గయ్‌ని " తమాషాగా తల వంచాడు

"ఐసీ " ఆవిడ ఆనందముతో అతని చేయిపట్టి ఊపింది

"వచ్చేటప్పుడు కర్నల్ గిరిని తీసుకురా "

"వాడి కన్ను ఆ సీత మీదుంది అదేమో పతివ్రతలా, వేషాలు "

"ఇలాంటివారిని ఆ ఫిల్మ్ చూపి నిముషములో లొంగదీయాలి, తెలిసిందా?"

---



---




"ఓ కె స్వయంగా వెళ్ళి తీసుకురా-వస్తాను" ఒకసారి సంపత్ చేతిలో చేయి కలిపింది పూర్తిగా కాకపోయినా, వారి వ్యాపారము, వారు చేసే పనులు అర్థం అయాయి రాత్రికి స్క్రీన్ చేసే ఫిల్మ్ కూడా ఏమిటో అర్థం అయింది అతను బలవంతంగా తన భావాలు అదిమిపట్టాడు సీతంటే ఆ సీతే ఉదయము తను రావటం చూచింది పలుకరించాలని కాబోలు, కారు స్లో చేసింది కాని సంపత్ నిర్లక్ష్యంగా లోపలికి వచ్చాడు సీత కళ్ళు ఆశ్చర్యంగా విచ్చుకోవటం గమనించాడు సీత కూడా మెంబరేనన్నమాట

"సంపత్' సాయంత్రము చాలా పని ఉంది మధ్యాహ్నము రెస్ట్ తీసుకో"

"థాంక్యూ" పంజరములో నుండి బయటపడ్డ పక్షిలా ఉంది అందరూ స్త్రీలు అందచందాలు చూపాలని, యెంతో దయనీయంగా వర్ణించారు పురుషులకు కూడా ఇలాంటి సమస్య లుంటాయని వారి ఊహ కందని విషయము

ఒట్టలు మార్చుకుని, ఇంటికి వచ్చాడు. ఆమెను తీసుకు వెళ్లి ఆస్పత్రిలో అడ్మిట్ చేయాలి చేతికి డబ్బు వస్తేగాని ఏ పనీ చేయలేడు. జావకాచి త్రాగించాడు వంట చేద్దామనుకుంటే, సుశీల భోజనము తెచ్చింది భోజనముచేసి నిదురపోయాడు ఆవరణ అంతా నిశ్శబ్దంగా ఉంది రామనాథం ఇల్లు వదిలాక బాబు ఇంటిపట్టునే ఉండటము లేదు

సాయంత్రము స్నానముచేసి అస్తానా ఇంటికి వెళ్లాడు అప్పటికే రక, రకాల స్త్రీలు చిన్న హాల్లో కూర్చున్నారు, పురుషులు ఒకరిద్దరున్నారు

"హాయ్ సంపత్' రా, రా వీళ్లందరికీ నీ ఒరిజినల్ బ్యూటి కావాలంట" అస్తానా లాక్కుపోయి డయాస్‌పై నిలబెట్టాడు, సంపత్ అసహ్యముతో ముఖం ప్రక్కకు తిప్పుకున్నాడు "మందు నాయనా" తల్లి ముఖం కనిపించింది ఇటు ప్రక్క తిప్పాడు 'నా డబ్బు ఇచ్చి పుణ్యము కట్టుకో సంపత్'' అంటూ సునీతి ముఖం కనిపించింది అంతే ఆవేశంగా షర్ట్, బనీన్ లాగి పారవేశాడు,

# జీవనం అంటే నీరు

"కృష్ణా గోదావర్యోర్మధ్యదేశే".. అని ప్రతిరోజు స్మరించుకోవడం ఎందుకంటే యీ జీవనదులే మనకు జీవనాధారాలు.

జీవనం అంటే నీరు అని కూడా అర్థం. ఈ రెండు అర్థాలు ఎంత చక్కగా కలిశాయి మన తెలుగు ప్రజల జీవితంలో!

కృష్ణమీద నాగార్జున సాగరం. గోదావరిమీద పోచంపాడు ప్రాజెక్టులు తెనుగు తల్లి ముఖంమీద నిలిచిన విజయ గర్వ రేఖలు.

వంశధార శ్రీకాకుళం జిల్లాకు వరప్రసాది. దీనివల్ల సుమారు లక్షన్నర ఎకరాలు సాగవుతుంది.

1951 - 71 యీ యిరవై సంవత్సరాల్లో
సేద్యపు నీటి పారుదల పథకాలమీద
336 కోట్ల 26 లక్షలు ఖర్చు పెట్టారు.

---

సమాచార, పౌరసంబంధ శాఖ, హైదరాబాదు.

# గృహమే స్వర్గ సీమోచ్!

“వీరా పేరు మార్చుకోండి,”

సచ్చిదానంద వర ప్రసాద శాస్త్రి చొక్కాకు పిన్ను పెడుతూ అన్నది లావణ్య

పెళ్లాం వూడిపోయిన గుండీని తిరిగి కుట్టనందుకు కోపం రాలేదు కానీ, తన పేరు గురించి మరోసారి కామెంట్ చేసినందుకు మాత్రం కోప మొచ్చింది యశోధరను, రాహులుణ్ణీ వదలి వెళ్లిపోయే సిద్ధార్ధుడిలా చూసి ఆఫీసు కెళ్లాడు స. వ శాస్త్రి

ఆఫీస్ కాంటీన్‌లో ఫాన్ కింద అతనికి జ్ఞానోదయమైంది బస్తా బియ్యం సరిపడా రాశేట్టు, తనకు పేరుపెట్టిన తలి దండ్రుల్ని భక్తితో విసుక్కున్నాడు లావణ్య పేరు చూసి ఈర్ష్యపడ్డాడు

సాయంత్రం ఇంట్లో, పనిలో వున్న భార్యని “లావణీ' ఇలా రా క్విక్'” పనున్నట్టు పిల్చాడు

హడావిడిగా వచ్చిన లావణ్యకు, ఎదిరింటి లాన్‌లో యాపిల్ ముక్కలు తింటూ, ఫెమీనా తిరగేస్తున్న సింధీ అమ్మాయిని చూపిస్తూ—

“నువ్వెప్పుడైనా అలా ఉన్నావా?” అడిగాడు

“ఏమండీ' మీరెప్పుడైనా శతృఘ్న సిన్హాలా వున్నారాండీ?” అని ఎదురు ప్రశ్నించింది లావణ్య అతని ముఖం వంక చూడకుండానే లోపలికి పారిపోయింది

ఇంత స్వీట్ రిటార్ట్ ఇచ్చిన భార్యకు తెలుగు సినిమా చూపించి, తిక్క కుదర్చాలి అని తీర్మానించుకున్నాడు శాస్త్రి

“సినిమా కెళ్దాం - త్వరగా రెడీకా లావణీ'” అని హుషారుగా అన్నాడు

“ఇవాళ ఇంకా పనిమనిషి రాలేదండీ- ఇంటెడు చాకిరీ మిగిలిపోయింది రేపు వెళ్దాంలెండి” గిన్నెలు తోమడానికి ముందేసుకుంటూ అంది లావణ్య

“డోంట్ వర్రీ ఎబౌట్ పనిమనిషి హోటల్లో భోంచేద్దాంలే ఇవ్వాళ్టికి తీరా సినిమాకు రాకపోతే పాటలు బాగున్నాయనీ, సినిమా చూడలేకపోయాననీ పశ్చాత్తాప పడ్తావ్” అని బెదిరించ మాశాడు శాస్త్రి

“పశ్చాత్తాపపడి తలుపు సందున చెయ్యి పెట్టి నలగగొట్టుకోడాలు లేవులెండి అయినా ఏం పాటల్లెండి బాబూ, వకరి కొకరు వంతలు పాడుకుంటూ చివరికి చేతులు పెనవేసుకుని “స్వర్గాలే దిగి వచ్చునులే” అని పరుగెత్తుకెళ్ళటమేగా'” అంటూ లావణ్య గలగలా నవ్వింది

“అవున్లే' నేనన్నదానికి అడ్డం చెప్పటమే తప్ప తమ రెప్పుడు సరేనన్నారు గనక'” ‘జీవితాంతం ఇలా గిన్నెలే తోముకుని బతుకు’ అనే శాపం ఇచ్చి వెళ్ళ

---

చోడవరపు పట్టాభి

బోయాడు

భర్తకు కోపం తెప్పించేందుకు భార్య కవ్విస్తుంది.

భార్య కవ్వింపులే ఆ భర్తకు ఎంతో రుచి మరి

"ఏవండోయ్, మీ తెలుగు సినిమాలో వచ్చే హెవీ సీన్లకు హృదయం పొంగి పిస్సీసు గుచ్చుకోగలదు - జాగ్రత్త!" అంటూ పకపకా నవ్వింది లావణ్య,

"ఆటకాడికి నీ మాడు జోకులు మితి మీరుతున్నాయ్ ఏమన్నా అందామను కున్నా, నీ కడుపులో వున్న నా పిల్లాణ్ణి చూసి క్షమిస్తున్నా" అన్నాడు కోప కంఠుడిలా

"పిల్లాడేం కాదులెండి మనకు ఆడ పిల్లే శశికళ"

"శశికళా కాదు సునాముఖీ లేదు- నోరు మూసుకుని గిన్నెలు తోముకో నేసూ, మారుతీ వెళ్తాం" అని వెళ్ళనే వెళ్లాడు శాస్త్రి

* * *

సినిమా మానొచ్చిన శాస్త్రికి లావణ్యా తన బావమరిదీ సర్దాగా కబుర్లు చెప్పు కుంటూ కనబడ్డారు

"ఎప్పుడు రావడం?" శాస్త్రి పలక రింపు

"ఇప్పుడు రావడమేమిటనా నీ వుద్దేశం బావా?" బావమరిది పరిహాసం

"మీరే జోకుల వంశంలో పుట్టినట్టు ఎప్పుడూ హాస్యాలేనా కొంపలో" చిరు కోపం అభినయించాడు శాస్త్రి

"దుర్వాసుడితో సంబంధం కలుపు కునే ముందు నవ్వుతూ, తుళ్ళుతూ వుండే వాళ్ళం లెండి" బాకీ తీర్చేసుకుంది లావణ్య

"లేచి వెళ్ళి వడ్డించు నా కాకలే స్తోంది" అన్నాడు శాస్త్రి ఆవులిస్తూ

"రారా అన్నయ్యా! వెంటనే వడ్డిం చకపోతే సముద్రాలుఅవుపోసన పట్టెయ్య గలరు" అంటూ వడ్డించింది లావణ్య

"నువ్వేదో మీ బావను అడుగుతా నన్నావు గదరా! అడగవేం!" సూచన ప్రాయంగా అందించింది అన్నయ్యకు

ప్రమాదాన్ని పసిగట్టి "అతనేం అడ గక్కర్లేదు—నేనా వార్త వినలేను బాబోయ్!" అన్నాడు శాస్త్రి అరిచినంత పని చేస్తూ,

"అదిగాదు బావా! చెల్లాయ్ కిప్పుడు ఎడో నెల కదా! అమ్మా వాళ్ళు, వెంట పెట్టుకు ఓమ్మన్నారు" అన్నాడు సంజా యిషీ ధోరణిలా

"ఏడో నెలా లేదు గోంగూరా లేదు వొస్తుంది లేవోయ్" ఆమె వెళ్ళి పోతుందనే ఆలోచన భరించ లేక, "ఈ ప్రసంగం ఇంతటితో సమాప్తి" అన్నాడు శాస్త్రి

సిగరెట్ ముట్టించి "పాపం! మీ అన్నయ్యకు ఇక్కడే పక్కెయ్ లావణీ!" అన్నాడు ఆదోలా నవ్వుతూ

బావమరిది, కేలండర్ వంక చూస్తూ నవ్వు దాచుకున్నాడు

మేడమీద— వెన్నెల్లాంటి పక్కమీద శాస్త్రి

పాల నురుగులాంటి పల్చని వెంకట గిరి చీరలో లావణ్య

ఆమె సాన్నిధ్యంలో ప్రపంచాన్ని మర్చిపోతా డతను

"ఇప్పుడు వెళ్లకపోతే ఏమోయ్ నువ్వు!" బ్రతిమాలాడతను

"హోటల్‌వాళ్ళ వేపుళ్ళు బాగుంటాయ్ అంటారుగా—పైగా మీకు మీ మారుతి తోడున్నాడుగా!" కవ్వించిందామె

"మీ యింట్లో నేను నిన్ను దిగవెట్టొ స్తాన్లే మీ అన్నయ్యను పంపెయ్యరా" ప్రాధేయపడ్డాడు శాస్త్రి

లావణ్య వెన్నెల్లా నవ్వింది

"ఆరు నెలలేగా! తరవాత మేం వొచ్చేస్తాం" అదేదో అరగంటే అన్నట్టు వూరడించింది

"ఉద్ధరించార్లే తరవాత మటుకు రావడ మెందుకూ"

"విడాకులిస్తారేం ఖర్మ!" వసంతంలా చల్లగా వుందామె నవ్వు

ఆ రాత్రి శాస్త్రి నిద్రపోలేదు ఆమెను నిద్ర పోనివ్వనూ లేదు

* * *

తెల్లారి శాస్త్రి మేడ దిగుతూ—ఏడు గంటల బడికి సిద్ధమై కూర్చున్న కుర్రా డిలా వున్న బావమరిదిని చూసి నవ్వు కున్నాడు

పెరట్లో పళ్ళు తోముకుంటూ నిల బడ్డాడు శాస్త్రి

లావణ్య ఏం చెబుతున్నా పరధ్యా నంతో వినిపించుకోలేదు

అతని చూపును సూటిగా చూస్తూ వెళ్ళింది లావణ్య

పద్దెనిమిదేళ్ల మంగి అస్తవ్యస్తంగా వున్న పమిటతో పరిసరాలను మరిచిపోయి




పనిచేసుకుంటోంది

లావణ్య కోపంగా శాస్త్రి వీపుమీద మోచేత్తో పొడిచింది

"అయితే సాయంత్రం బండికి మీ ప్రయాణం తప్పదా?" అన్నాడు అదోలా నవ్వుతూ

"మీరిలా కాలేజి కుర్రాళ్ళ వేషాలు వేస్తే ఈ పురుడు ఇక్కడే" మిషన్ గన్‌లా మోగింది లావణ్య హెచ్చరిక

"అదిగాదు లావణీ! పాపం మంగి కేదైనా పర్మినెంట్ ఏర్పాటు చెయ్యాలని పిస్తోంది" అని కసిగా కవ్వించాడు

చీత్కారంతో లోనికి వెళ్ళిపోయింది లావణ్య

"అయితే మధ్యాహ్నం పర్మిషన్ తీసుకుని వచ్చేస్తావుగా!" బావమరిది ప్రయాణాన్ని ఖాయపరిచాడు

టిఫిన్ ముగించి, భార్య యిచ్చిన పైె అందుకుని—

"నేనొచ్చేసరికి అన్నీ సర్దుకుని రెడీగా వుండండి" అంటూ వెళ్ళిపోయాడు శాస్త్రి

ట్రైన్ కదలడానికి ఇంకా టైం వుంటటంవల్ల కూల్ డ్రింక్స్ తెచ్చి భార్యకూ, మరిదికీ అందించాడు శాస్త్రి

"ఇంటిని అందముగా తీర్చి దిద్దు కొనుట ఎట్లు—" పక్క పాసింజర్లకు వినపడకుండా భర్తతో వల్లె వేసింది

ఆమె ఆరోగ్యం గురించిన జాగర్తల జాబితాలు వివరించాడు శాస్త్రి గంట మోగడంతో శాస్త్రి బండి దిగాడు

"నువ్వూ కూడా అప్పు డప్పుడూ వీలు చూసుకుని వస్తూ వుండు బావా" అన్నాడు బావమరిది

"అలాగే లేవోయ్" అంటూ లావణ్య వున్న కిటికీ దగ్గరకు వెళ్ళాడు

"మీ మారుతి తిరుగుళ్ళు చూసి మీయా వాళ్ళు కాల్చుకున్నారో, మీ సావాసానికి వచ్చి కొట్టేస్తా అన్నట్టు మీది అసలే మతిమరుపు వ్య వ హా ర ం ఎక్కడి వక్కడే పారేసి పోతుంటారు ఎందు కైనా మంచిది పనిమనిషి మంగికి ఒక నెల జీతం అదనంగా ఇచ్చి నిలిపెయ్యండి. ఆరు నెలలు అనవసరంగా " అర్థోక్తి లోనే మందలింపును ఆపేసింది లావణ్య

"దాని సంగతి నా కొదిలేద్దూ" ముసి ముసి నవ్వు నవ్వాడు శాస్త్రి

కదిలిపోతున్న ట్రైన్‌లో, ఆర్టిస్టిక్‌గా చెయ్యి వూపుతూ, జారిపడుతున్న కన్నీటి ముత్యాల్ని సుతారంగా లావణ్య తుడి చెయ్యడం శాస్త్రి చూడకపోలేదు

ట్రైన్ వెళ్ళింతర్వాత మిగిలిన ప్లాట్ ఫారానికి, అప్పటి అతని మనసుకు తేడా లేదు

* * *

ఇంటి తాళం తీసి లోపలి కొచ్చాడు శాస్త్రి.

లావణ్య లేని ఇల్లు చిన్నబోయి కను పించింది

ఆ శూన్యంలో ఆరు నెలలు గడపడం ఎలా అనుకున్నాడు

ఆమె తాలూకు తీపి జ్ఞాపకాలు అతని పట్ల పల్లేళ్ళుగా అనుక్షణం అతన్ని కలవర పెట్టాయ్

తొలి పురుడు సవ్యంగా జరగాలి తన లావణ్య బంగారు బాబును పొత్తి ళ్ళలో పెట్టుకుని తిరిగి రావాలి ఒకవేళ అనుకోనిది ఏదైనా జరిగితే

శాస్త్రి, పీడకల వచ్చిన చిన్నపిల్ల వాడిలా దడుచుకున్నాడు ఏమీ తోచక, స్టౌ వెలిగించి హార్లిక్స్ కలుపుకున్నాడు

కాలింగ్ బెల్ మోత విని, తలుపు తెరిచాడు

పని మనిషి మంగి—పని వుండదేమో నని సందేహిస్తూనే లోపలి కొచ్చింది

శాస్త్రి కే పని చెప్పాలో తోచలేదు ఏం మాట్లాడినా మంగి ముసి ముసిగా నవ్వేది. పనై పోగానే మంగి వెళ్ళిపోయింది ఇష్టం లేకపోయినా. శాస్త్రికి హోటల్ కూడు తప్పనిసరైంది

ఒక రోజున మంగి "మా అయ్య మీతో మాటాడాలంట ఎప్పుడు రమ్మం టారు" అని సిగ్గుపడుతూ అడిగింది.

"రేప్పొద్దున" అన్నాడేకానీ మంగి




బాబు తనతో ఏం మాట్లాడ్తాడోనని చాలా ఖంగారు పడ్డాడు శాస్త్రి

* * *

ఆరు యుగాలై శాస్త్రిని వేధించిన ఆరో నెల ముగింపులో మూడు నెలల పాపను పొత్తిళ్ళ కెత్తుకుని టాక్సీలో నుంచి దిగింది లావణ్య

"ఇదుగో మీ సునాముఖి" మీటర్ చెల్లించిన భర్తకు పాపను అందించింది

శాస్త్రి పరీక్ష తప్పిన కుర్రాడిలా చూచాడు

డిపాజిట్ దక్కని నాయకుడిలా నిట్టూర్చాడు

తన చేతులోని లిల్లీపుట్ హఠాత్తుగా పెరిగి, ఆరు గజాల చీర కట్టుకుని, కాలేజికి వెళ్తున్నట్టు 'అమ్మాయి పెళ్ళి గురించి ఇకనైనా పట్టించుకుంటారా లేదా' అని నిగ్గదీస్తూ కొద్దిగా నెరిసిన జుట్టు మేకప్‌లో కనుపించింది లావణ్య తన ఊహలకు తనే నవ్వుకున్నాడు.

లావణ్య మాత్రం తన ఇల్లంతా తృప్తిగా చూసుకుంది

"నట్టింట్లో చెట్లూ గట్రా, మీ కేమో మూరెడు గడ్డం పూహించుకున్నానే" ఆశ్చర్యం కనబర్చింది.

అంతలో బెడ్‌రూం శుభ్రం చేసి తిరిగొస్తున్న మంగి కనబడ్డంతో లావణ్య ముఖంలో రంగులు మారాయి

"దీన్ని మాన్పించరని నేనప్పుడే అనుకున్నా" అస్పష్టంగా గొణిగింది లావణ్య

* * *

పెళ్ళి కాకముందుఒంటరిగా పుద్యోగం వెలగబెట్టేప్పుడు తన బ్రహ్మచారి విజయాల గురించి శాస్త్రి, లావణ్యకు పూసగుచ్చినట్టు వర్ణించేవాడు ఆమె ఆ కథలు వినలేకపోయినా, బలవంతంగా, ఏదో ఒక సందర్భంలో వల్లించే వాడు

అతను లావణ్యకు ఒంటిమీద తేళ్ళూ, జెర్రులూ పాకినట్లుండేది ఆ టాపిక్ మార్చమని బ్రతిమాలుకునేది కూడా చిరునవ్వులతోనే ఆమె వేడుకోలు తోసి పుచ్చినపుడు మాత్రం భర్తల ఆధిక్యం అమలు జరుపుతున్నట్లుండేది తను భర్త నైజాన్ని అర్థం చేసుకునేందుకు ప్రయత్నించింది కూడా కేవలం తన ఇమేజ్‌ని పెంచుకునే ప్రయత్నమా?

దానికి ఇదే మార్గమా

తనను ప్రేమించటం లేదా?

ఈ ఒక్క దుర్గుణం తప్ప అతనిలో వేరే ఏ లోపమూ కనిపించదే?

తను పొద్దున పెరట్లో ఆయన్నీ మంగినీ అతి దగ్గర్లో చూసింది

శాస్త్రి మంగికి డబ్బిస్తున్నాడు

లావణ్యలో కలవరం మరింతగా కలకేసింది

"జీతం నిన్నే యిచ్చేశాగా మీ రెందుకు యిస్తున్నారు" అని తనడిగితే "అది నువ్విచ్చే జీతం ఇది నే నిచ్చే మామూలు" అని తేలిగ్గా చెప్పి దాటేశాడు ఆరు నెలలు తనింట్లో లేదు

ఆయ నొక్కరు

అదుపులేని ఒంటరి మగతనం

కడుపు నింపుకోడం కోసం కక్కుర్తి పడే పరిస్థితిలో పనివాళ్ళు

మామూలుగా జరగకూడనిదే మామూలై పోయి వుంటుంది

లావణ్య మనసు ఆలోచనల కోతకు అలిసిపోయింది. కానుపు తరవాత నీరస పడిపోయింది ఎండుకారం తిన్నా, ఏడాదికో బిడ్డను కన్నా, గుడిసెల్లో వున్న వాళ్ళు అలసటను లెక్కచెయ్యకుండా పనులూ చేస్తారు. పాడుపనులకూ తెగిస్తారు

స్నానం ముగించుకొచ్చిన లావణ్యకు మంగి వాంతి చేసుకోవడం కనుపించింది ఆమె మెదడు మొద్దుబారింది తనకు పిచ్చెత్తినట్టు భ్రమపడింది

విసురుగా లోనికి వెళ్తున్న లావణ్య-

"వొంట్లో నలతగా వుంటోంది ఈ పూట పన్జెయ్యలే నమ్మగోరూ" అంటున్న మంగి మాటలను వినే స్థితిలో లేదు

* * *

"పాప నిద్రపోయిందా లావణీ?"

సమాధానం లేదు

"లైటు తీసి ఇట్రా?"

చలనం లేదు

"చెపుతుంటే వినిపించదా? నిన్నే"

శాస్త్రి కసురుకున్నాడు

"వినబడ్డమే ఏం ఖర్మ మీరు చేసిన ఘనకార్యాలు కళ్ళకు కనబడ్తుంటే" దుడుకుగా జవాబిచ్చింది లావణ్య

శాస్త్రి ఆ సమాధానం విని నిర్విణ్ణుడైనాడు

"నీ వుద్దేశం ఏమిటి లావణీ?"

అన్నాడు లాలింపుగా

"నాతో మాట్లాడకండి మీ పద్ధతులు నాకేం నచ్చడం లేదు" అంటూ ఈసడించుకుందామె

ఆ రాత్రే ఆమె అభిప్రాయ మేమిటో తేల్చుకోవాలనే పట్టుదల పెరిగింది శాస్త్రికి.

"అసలు సంగతి చెప్పకుండా అర్థం

లేని అనుమానాలతో కుమిలిపోతా వెందుకూ'" కటువుగా అడిగాడు

లావణ్య కన్నీళ్ళు పెట్టుకుంది ఏడుస్తూనే—

"మంగికి నెల తప్పింది" అనలేక అందా మాట

"మంచిదేగా"

"మనల్ని నమ్మి, కూలి డబ్బులకోసం వచ్చిన దానితో మీ రెండుకలా ప్రవర్తించారు" వెక్కిళ్ళతో ప్రశ్నించింది

"యూ ఆర్ ఫూలిష్ రెండయింది గాని, ఇక పడుకో" అని లైటార్పి పడుకున్నాడు శాస్త్రి

లావణ్యకు నిద్ర పట్టలేదు

* * *

తెల్లవారుఝామున—కాలింగ్ బెల్ మోతకు తలుపు తీసింది లావణ్య

మంగి బెరుగ్గా పాల సీసాతో లోనికొచ్చింది మంగి మెడలో మంగళ సూత్రం తళుక్కుమని మెరిసి తనను వెక్కిరించినట్టయింది లావణ్యకు.

"మంగీ నీకు పెళ్ళయిందా?" సందేహం తీరక అడిగేసింది

"మూణ్ణెల్లయిందమ్మగోరూ అయ్యగారే మాకు డబ్బిచ్చి ఆదుకున్నారు—మామని మీకు సాయంకాలం సూపిత్తా'"

* * *

సాయంత్రం మామని చూపించి లావణ్య దగ్గర సినిమాకు డబ్బులు తీసుకున్న మంగి దంపతులకు శాస్త్రి ఎదురు పడ్డాడు

"దేవిగారి అనుమానం తీరిందా'" అంటూ పత్రికలో కథలు చదువుతూన్న లావణ్య పక్కనే కుర్చీలో కూచున్నాడు.

"మీతో మాట్లాడను పొండి గుండెలు పగిలేట్లు నాటకమాడి హడల గొట్టారు మీ ప్రాక్టికల్ జోక్‌తో నాకు పిచ్చి పట్టేది"

"మా మారుతిగాడన్నట్టు ఆడవాళ్ళంతా నిజంగా పిచ్చివాళ్ళే"

"అదుగో—మళ్ళీ మారుతి పేరెత్తారు?" అంటూ గులాబీ బుగ్గలమీద కెంపులు పూయించింది లావణ్య.

శాస్త్రి పగలబడి నవ్వాడు

"పిచ్చి లావణీ' నీకివ్వాళ అసలు విషయం చెబ్తున్నా నాకు మారుతి అనే స్నేహితుడే లేడు నా కథలన్నీ కల్పితాలే నీ రియాక్షన్ చూడాలని చెప్పానే గానీ వేరేమీ కాదు నాకు నువ్వు తప్ప ఆడవాళ్ళంటేనే భయం ఇప్పటినించీ మెలో డ్రామాలు ఆడను" అంటూ ఆమె చేతిలో ఒట్టేశాడు

లావణ్య-క్షమించుకోడాలు సీను అయిపోయిం తర్వాత వున్న హీరోయిన్‌లా చూసింది

"నువ్విప్పు డెలా వున్నావో తెలుసా?"

కుతూహలంగా అతని కళ్ళలోకి చూస్తూ "తెలియదు" అన్నది లావణ్య

"ఆపిల్ బుగ్గల సింధీ అమ్మాయిలా వున్నావు"

"మీరు మాత్రం శతృఘ్నసిన్‌హాలా లేర్లేండి"

ఇద్దరూ నవ్వుకున్నారు

"సచ్చిదానంద వరప్రసాదశాస్త్రిగారూ-టెలిగ్రాం"

పోస్ట్‌మేన్ కేక



# ★ జాలిగుండెల వెనుక ★

రెండు బస్సులు మారి ఆఫీసునుంచి నే నిల్లు చేరుకునేసరికి ఆరుదాటిపోతుంది అప్పటికే తను కూడా ఆఫీసునించి తిరిగి వచ్చి కాఫీతో నాకోసం ఎదురు చూస్తుం టుంది మా ఆవిడ మొదట్లో ఆమె చేతి కమ్మని కాఫీతోబాటు ఆవిడ ఏకరువు పెట్టే వాళ్ళ ఆఫీసు సంగతులు కూడా సరదాగా వింటూ వుండేవాణ్ణి కొన్నాళ్ళకి ఓపికతో వినటం సాగించాను మరికొంత కాలం తరువాత ఆ వోపిక కూడా హరిం చుకు పోయి విసుగుతో చెవు లప్పగిం చటం అలవాటు చేసుకున్నాను నా అవస్థ చూసి ఆ భగవంతుడికే జాలి కలిగిందో లేక మా ఆవిడే కరుణించిందో చెప్పలేను గాని గత పది, పదిహేను రోజుల్నించి ఆవిడ తన ఆఫీసు పురాణం నాకు విని పించటం మానేసింది కాని ఈ పరి ణామం అమాంతంగా ఆవిడకి నా మీద పుట్టుకొచ్చిన దయచేత కాదని తొందర్లోనే తేలిపోయింది ఆవిడ వుద్యోగంలో చేరిన ఈ ఆర్నెల్ల కాలంలో కనీసం రోజు కొకటి చొప్పున వాళ్ళాఫీసు జీవుల చరిత్రలన్నీ నాకు వినిపించేసింది ఇక వినిపించటానికి తన కార్యాలయంలో నర మానవుడంటూ ఆమెకి దొరికి వుండడు ఈ సంగతి వాళ్ళాఫీసులో పనిచేసే వుద్యో గుల సంఖ్యనుబట్టి తెలుసుకోగలిగాను

ఎలాగైతేనేం ఈ పది రోజులూ నా ప్రాణానికి హాయిగా వుంది టైపిస్టు రాధల్ని గురించి, గుమాస్తా గురునాథాల్ని గురించీ, సబ్ హెడ్ సంజీవరావుల్ని గురించీ విని విని తల దిమ్మెక్కి పోయి వున్న నాకు ఈ పది దినాలూ పర్వదినా లుగా కనిపిస్తున్నాయి ఆఫీసునుంచి తిరిగి రాగానే కాఫీ తాగి తీరిగ్గా పేపరు తిరగేయ గల్గుతున్నాను పార్కు కెళ్ళి పాతమిత్రు లందర్నీ మళ్ళీ కలుసుకో గలుగుతున్నాను లైబ్రరీలో కాసేపు పత్రికలు చూడగలుగుతున్నాను కాని ఈ సరదా అంతా మున్నాళ్ళ ముచ్చటే అయింది,

అప్పుడే స్నానం ముగించి పడక్కు ర్చీలో వాలి పత్రిక మొదటి పేజీ తిరగే స్తున్నాను కాఫీ కప్పు నా చేతి కందిస్తూ "ఈ సంగతి విన్నారా?" అంది మా ఆవిడ

పిడుగు పడ్డట్టు అదిరిపడ్డాను ఆగి పోయిందనుకున్న ఆవిడ ఆఫీసు గొడవల్ల వడగళ్ళ వాన మళ్ళీ మొదలౌతోందని తెలుసుకునేసరికి నాకు ఏడుపొచ్చినంత పనైంది

కాఫీ చప్పరించటం కూడా మర్చి పోయి దిగాలుపడిన మొహంతో ఆవిడ కేసి చూస్తూ కూర్చున్నాను,

"ముందు కాఫీ కానివ్వండి తీరిగ్గా చెబుతాను" అంది ఆవిడ నాకు దగ్గరగా కుర్చీ లాక్కుని కూలబడుతూ

ఈ పదిరోజులుగా లేని హుషారేదో ప్రస్ఫుటంగా కనిపించింది ఆవిడ ముఖంలో

"ఏవిఁటి సంగతి॰ జులపాల హిప్పీ గాణ్ణి ఓ శైపిస్టు జూలీ రెండో చెంప కూడా వాయగొట్టిందేవిఁటి ఈ సారి" అన్నాను లేని నవ్వుని నా ముఖాన పులుము కుని

"కాదు" అని ముద్దుగా తలూపింది ఆవిడ

"ఏ గుర్నాథం పెళ్ళాం సరాసరి సెక్షన్‌కొ కొచ్చేసి మొగుణ్ణి జుట్టుపట్టుకుని మరీ లాక్కెళ్ళింది ఇంటికి-అవునా?"

అదికూడా కాదనేసింది మా ఆవిడ

నూట డెభ్భైకి పైగా వున్న ఆఫీసు పక్షుల్లో ఏ పక్షిని గురించి ఇప్పుడు చెప్ప బోతుందో నేను మాత్రం ఎలా వూహించ గలను? అందుకే ఓడిపోయినట్టు ఒప్పేసు కున్నాను

"నేను చెప్పబోయేది ఓ కొత్త అమ్మాయిని గురించి" అంది ఉపోద్ఘాతం ప్రారంభించే ధోరణిలో

ఆ మాటతో నాలో కూడా కొంత కుతూహలం పెరిగింది కుర్చీలో సర్దుకుని కూర్చున్నాను

వాళ్ళాఫీసులో ఆ రోజు కుందనపు బొమ్మలాంటి ఓ అమ్మాయి కొత్తగా జాయినయింది ఆమెను మా ఆవిడ సీటుకే వేశారు లంచ్ శైమయ్యేసరికల్లా, ఏదో జన్మాంతర సంబంధం వున్నట్లు ఇద్దరూ ఆత్మీయుల్లా ఒకరితో ఒకరు కలిసిపోయారు పుత్తడి బొమ్మలాంటి ఆ అమ్మాయి జీవితం వెనుక గుండెలు పిండేసే ఓ విషాద గాథ వుండిపోయింది దేవుడు ఆమెకు తీరని ద్రోహం చేశాడు ఆ అమ్మాయికి మూడేళ్ళ కిందటే పెళ్ళ యింది భర్తకు బొంబాయిలో వున్న హెడ్డాఫీసులో మంచి ఉద్యోగం. సినిమా హీరోలా వుండేవాడు ఇద్దరూ చిలకా గోరింకల్లా వున్నారని అందరూ ముచ్చట పడ్డారు కాని వాళ్ళ దాంపత్యం మూణ్ణాళ్ళ ముచ్చటే అయ్యింది పెళ్ళయిన మూణ్ణె ల్లకే పాపం ఆమె భర్త కారేక్సిడెంటులో చనిపోయాడు అప్పుడా అమ్మాయి భర్త దగ్గర లేదు కూడాను ఏదో పల్లెటూళ్ళో వాళ్ళ బంధువుల దగ్గరుంది భర్త మృత దేహాన్ని కడసారి కళ్ళారా చూసుకునే భాగ్యం కూడా లేకపోయింది ఆ తరు వాత ఆమె కష్టాలకు అంతేలేదు నా అన్నవాళ్ళెవరూ ఆమెను చేరదీయలేదు వాళ్ళనీ వీళ్ళనీ బతిమాలుకుని, ఎలాగో ఓ అనాథాశ్రమంలో చేరి ఆగిపోయిన చదువుని పూర్తిచేసింది బొంబాయి హెడ్డాఫీసుకి అప్పీలు చేసుకోగా మేనేజి మెంటు కనికరించి మద్రాసు బ్రాంచి ఆఫీసులో వుద్యోగం ఇచ్చారు

మా ఆవిడ చెప్పడం ముగించింది. నా చేతిమీద రెండు వెచ్చని కన్నీటి బిందువులు పడేసరికి తల పైకెత్తాను ఆవిడ చెంపలమీద కన్నీటి చారికలు కని పించాయి, ఎప్పుడూ చిలిపిగా, ఇతరుల్ని గురించి వాడీలు చెప్పడమే పనిగా పెట్టు కున్న మా ఆవిడ గుండెల్లో ఎంత జాలీ, సానుభూతీ గూడుకట్టుకుని వున్నాయో నాకా క్షణాన అర్థమైంది

"పిచ్చిదానా, నువ్వెందు కేడుస్తావు? మరీ అంత సెన్సిటివ్‌గా వుండటం కూడా మంచిది కాదు ఏం చేస్తాం చెప్పు తాము చెయ్యని పాపానికి కొందరి జీవితాలు అన్యాయంగా బలైపోతూ వుంటాయి

ఆ కొత్తమ్మాయిని గురించి ఈ నాడు నీకు తెలిసింది గనుక ఇలా బాధపడి పోతున్నావు. కాని మనకు తెలియని ఎందరి జీవితాలో ఈ దేశంలో ఎన్నో రకాలుగా నలిగిపోతున్నాయి. విని వూరుకోవటం తప్ప ఎవరేం చేయగలరు చెప్పు" వూరడించే ప్రయత్నంలో అన్నాను.

పైట కొంగుతో కళ్ళు వత్తుకుంది మా ఆవిడ. ఆ కళ్ళల్లో కొంచెం కోపం తొంగి చూసింది.

"దేవుడు కరుణామయు డంటారే. ఇదేనా ఆయన నిర్వాకం! అంతగా తీసుకుపోవాలనుకుంటే కుంటివాళ్ళూ, గుడ్డి వాళ్ళూ, ఎండుటాకుల్లా పండిపోయిన వాళ్ళూ ఎంతమంది లేరీ లోకంలో. వాళ్ళందర్నీ వదలి ఆ అమ్మాయి భర్తే దొరికాడా ఆయనకి! ముద్దూ ముచ్చటా తీరకుండానే ఆ అమ్మాయి నిండు జీవితాన్ని మంట గలపటానికి ఆ దైవానికి మనసెలా వొప్పింది?"

మూణ్ణెల్లు జరిగిపోయాయి.

దేవుడు అన్యాయం చేసిన ఆ పుత్తడి బొమ్మను గురించీ, తనకు ఆమెతో ఏర్పడిన గాఢ స్నేహాన్ని గురించీ, ముచ్చటించుకున్న విషయాల్ని గురించీ, అప్పుడప్పుడూ నాతో చెపుతూనే వుంది మా ఆవిడ.

వాళ్ళిద్దరి సాన్నిహిత్యాన్ని చూసి కళ్లు కుట్టిన కొందరు ఆఫీసులో గుసగుసలాడుకునేదాకా కూడా వచ్చిందట.

"ఏమండీ! రేపు పండక్కి ఆ అమ్మాయిని మనింటికి భోజనానికి పిలిచానండీ. పాపం ఆ వర్కింగ్ విమెన్స్ హాస్టల్లో చప్పిడి మెతుకులు తిని తిని ప్రాణంవిసిగిపోయిందిట తనకి. మిమ్మల్ని పరిచయం చేసినట్టుగా కూడా వుంటుంది" అంది మా ఆవిడ నాతో ఒక రోజు.

నాకూ ఆ అమ్మాయిని చూడాలనే వుంది. "సరే" నన్నాను.

నే నూహించిన దానికంటే ఎన్నో రెట్లు అందంగా వుంది ఆ అమ్మాయి. నిజం చెప్పొద్దూ, ఆ సమయంలో మా ఆవిడ నా పక్కనే లేకుంటే ఒక్కసారి ఆ పుత్తడి బొమ్మను ఒళ్ళోకి లాక్కుని గట్టిగా ముద్దెట్టేసుకోవాలని అనిపించింది కూడాను.

రాత్రి భోజనాలైన తరువాత వరండాలో పక్కవేసింది ఆ అమ్మాయికి. గదిలో మొగుణ్ణి నేనొకణ్ణి తనకోసం వేచి వున్నాననే సంగతి కూడా గుర్తుకు రాలేదల్లే వుంది మా ఆవిడకి, అర్థ రాత్రి దాకా స్నేహితురాల్తో కబుర్లు చెపుతూ అక్కడే పడుకుని నిద్రపోయింది. ఆ రాత్రికి మా ఆవిణ్ని నానించి దూరం చేసిన ఆ పుత్తడి బొమ్మమీద నా కేర్పడిన అసూయ అంతా ఇంతా కాదు.

వారం రోజులైంది.

ఆ సాయంత్రం మామూలుగా ఆఫీసు నుంచి ఇంటికి తిరిగి వచ్చాను. కాఫీ కప్పుని నా ముందున్న స్టూలుమీద వుంచి అలవాటుకి భిన్నంగా మౌనం పాటించి గదిలోకి వెళ్ళిపోతున్న మా ఆవిడ వంక విస్తుపోయి చూశాను. కాఫీ తాగటం ముగించి గదిలోకి నడిచాను. మంచం మీద కాళ్ళు ముడుచుకుని పడుకుని వుంది.

"ఒంట్లో బావుండలేదా?" దగ్గిరికి నడిచి నుదుటిమీద చెయివేశాను.

నా చేతిని తొలగిస్తూ "బావుండకేం.



వ్యోం॥




గుండ్రాయిలా వున్నాను" అంది చిరాగ్గా

పక్కనే కూలబడి "మీ పుత్తడి బొమ్మ ఏఁవంటోం దేమిటి?" అన్నాను ఆవిడకు హుషారు తెప్పించాలనే వుద్దేశంతో

"ఛీ, దాని పేరెత్తకండి నా దగ్గర పుత్తడి బొమ్మట పుత్తడి బొమ్మ, అది కేవలం ఇత్తడి బొమ్మని ఈ రోజు తెల్సింది నాకు," అంటూ చివాలున లేచి కూర్చుంది

ఆవిడ అంటున్న దేమిటో అర్థం గాక దిమ్మెరపోయాను

"కాలం చెడిపోయిందండీ, మనుషులు మరీ బరి తెగించిపోయారు సంగనాచిలా ఎంత నాటక మాడింది పిచ్చిదాన్ని దాని అసలు రంగేమిటో తెలుసుకోలేక సొంత చెల్లెల్లా అభిమానించాను బాగా బుద్ధి చెప్పింది" కోపంతో మా ఆవిడ గొంతు వణుకుతోంది

"ఇంతకీ అసలేం జరిగింది? ఆ అమ్మాయిని గురించేనా నువ్వంటున్నది?" ఇంకా నమ్మ శక్యంగాక అడిగాను

"ఇంకా ఏం జరగాలి? మొగుడుపచ్చి మూడేళ్ళయినా తిరక్కుండానే ఎంత పని చేసింది, హవ్వ మా సెక్షన్‌లో ఆ జుల పాల హిప్పీగాడు లేడూ, వాడితో ఎంత కాలంగా గ్రంథం నడిపిందో మరి వాణ్ణి పెళ్ళాడేసి పూలూ, బొట్టూ పెట్టుకుని, తగుదునమ్మా అంటూ ముత్తయిదువులా ముస్తాబై వచ్చింది ఆఫసుకి ఛీ, ఛీ, సిగ్గులేకపోతే సరి "

నోట మాటరాక నిశ్చేష్టుడనయ్యాను

మూణ్ణెల్ల కిందట తన స్నేహితురాలికి దేవుడు చేసిన అన్యాయాన్ని తల్చుకుని కన్నీరు కార్చిన మా ఆవిడ ముఖం ఒక్క క్షణం నా కళ్ళ ముందు కదలి చెదిరి పోయింది

('కల్కి' తమిళ మాసపత్రిక నిర్వహించిన కథానికల పోటీలో బహుమతి పొందిన కథ—జనవరి '75 ) 




## దేవుడికి ఆటవిడుపు లేదు!

ఎన్నో వంద రోజులపాటు ప్రదర్శింపబడిన దేవుడే దిగివస్తే చిత్రంలో ప్రతి ఆటలోనూ దిగివచ్చిన దేవుడికి ఆటవిడుపు లేదు. అల్లు రామలింగయ్య సమర్పించిన యీ చిత్రం శతదినోత్సవం డిశంబరు చివర్లో మద్రాస్‌లో జరిగింది. సభను ప్రారంభించిన సినీనటుడు జగ్గయ్య యీ చిత్రం తన కెందుకు నచ్చిందో వివరించారు. అధ్యక్షత వహించిన ఎన్. టి.





'పాడిపంటలు'లో కృష్ణ

రామారావు మరోసారి 'వ్యాపారం తర్వాతనే కళాపోషణ' అన్న తన వాదాన్ని పునరుద్ఘాటించారు. ఈ చిత్ర నటీనటులకు, సాంకేతిక నిపుణులకు మెమెంటో లందించిన అక్కినేని నాగేశ్వరరావు యీ చిత్రంలోని విశేషాల పరిశీలన జరుపుతూ సుదీర్ఘోపన్యాసం చేశారు. ఈ చిత్ర దర్శకుడు దాసరి నారాయణరావును 'ది డైరక్టర్ ఆఫ్ ది డే' అని అభివర్ణించిన అక్కినేని, దాసరి దర్శకత్వంలో నటించాలని వుందన్న తన భావాన్ని వ్యక్తపరిచారు. 'నాగేశ్వరరావుగారు అవకాశమిస్తే తప్పక తాను ఆయనతో ఒక చిత్రం తీయగలన'ని వెంటనే ప్రకటించారు దాసరి నారాయణరావు. విజయవంతమైన నటుడూ, దర్శకుడూ కలిసిన చిత్రం త్వరలో ప్రేక్షకులు చూసే అవకాశం రావచ్చు. ఈ సభలో ఇంకా నిర్మాత డి. వి. ఎస్. రాజు నటుడు



'జ్యోతి'లో జయసుధ, జయలక్ష్మి

డారు. చిత్ర నిర్వాహకుడు అల్లు రామలింగయ్య తమ సంతోషాన్ని వ్యక్తపరుస్తూ, నిర్మాతలైన దాసరి సత్యనారాయణమూర్తి, అల్లు అరవింద్, వీర్రాజు, నారాయణమూర్తి గార్లను అభినందించారు. నవయుగ ఫిలింస్‌కు చెందిన కాట్రగడ్డ నరసయ్య వందన సమర్పణ చేశారు.

## మరో శతదినోత్సవం

దాసరి దర్శకత్వంలో 1975 లో విడుదలైన చిత్రాలన్నీ విజయవంతమయ్యాయి. బలిపీఠం, దేవుడే దిగివస్తే శతదినోత్సవాల తర్వాత 'భారతంలో ఒక అమ్మాయి' కూడా జనవరిలో శతదినోత్సవం జరుపుకొంది.

## డాక్టర్ భానుమతి

తెలుగు చలనచిత్ర చరిత్రలోనే తనకొక ముఖ్యమైన స్థానాన్ని సంపాదించుకొన్న ప్రజ్ఞావంతురాలు శ్రీమతి భానుమతి. ఇటీవల ఆమెకు ఆంధ్రా యూనివర్శిటీవారు 'కళాప్రపూర్ణ' బిరుదు నిచ్చిన సందర్భంలో మద్రాసులోని ఫిల్మ్ జర్నలిస్టులు 'భానుమతి అభినందన' సమావేశం జరిపి ఆమెను సత్కరించారు. ఆ సందర్భంలో వివిధ భాషారంగాల పాత్రికేయులు భానుమతి బహుముఖ ప్రజ్ఞల గురించి వివరిస్తూ మాట్లాడారు. హుందాగా, నిరాడంబరంగా జరిగిన ఆ సభలో తనకు జరిగిన సత్కారానికి శ్రీమతి భానుమతి కృతజ్ఞత చెబుతూ, తాను చిత్ర రంగ ప్రవేశం చేసినప్పటినుంచీ తాను పొందిన అనుభూతులను, అనుభవాలను చాలా వివరంగా చెప్పారు. శ్రీమతి భానుమతికి ఇదివరకే పద్మశ్రీ బిరుదూ



'యవ్వనం కాటేసింది'లో జయచిత్ర

ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతి వచ్చిన విషయం పాఠకులకు తెలుసు.

### నాంది!

తెలుగు చలనచిత్రసీమ ఆంధ్రప్రదేశ్‌కి తరలి వస్తే మంచిదన్న ఊహ చాలామందికి చాలా కాలంగా ఉంటున్నదే! (భాషా ప్రాతిపదికపై తెలుగు వారికి ప్రత్యేకంగా రాష్ట్రం ఏర్పడి చిరకాలం అయినప్పటికీ తెలుగు చలనచిత్ర పరిశ్రమ మద్రాసు నగరంలోనే స్థిరపడి ఉంది) నటుడు అక్కినేని నాగేశ్వరరావు ఆ కారణంగానే తన నివాసాన్ని హైదరాబాదుకు మార్చారు చాలా సంవత్సరాల క్రితం. అప్పటికే అక్కడ ఉన్న సారథీ స్టుడియో కళకళ లాడటం ప్రారంభించింది నాగేశ్వరరావు హైదరాబాదు రాకతో. అయితే తరువాత ప్రయత్నాలకు. ఎటొచ్చి గత రెండేళ్ళుగా ముఖ్యమంత్రి జలగం వెంగళరావు నాయకత్వాన గల మంత్రివర్గం తెలుగు చలనచిత్ర పరిశ్రమపై శ్రద్ధ చూపడం ప్రారంభించడంతో యీ ప్రయత్నాలకు ఊపిరి వచ్చింది. వెంటనే హైదరాబాదులో స్టుడియోల నిర్మాణాలు ప్రారంభమయ్యాయి. తెలుగు చలనచిత్ర రంగంలో మహోన్నతులుగా పేర్కొనదగ్గ పద్మశ్రీలు నాగేశ్వరరావు, రామారావు ఇద్దరూ అక్కడ స్టుడియో నిర్మాణం సాగిస్తున్న సంగతి మీకు తెలుసు. తెలుగువారి పెద్ద పండుగ సంక్రాంతికి, జనవరి 14న అక్కినేని నిర్మించిన 'అన్నపూర్ణా స్టుడియోస్' ను రాష్ట్రపతి ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ ప్రారంభిస్తున్నారు (ఈ రిపోర్టు మీరు చదివేసరికి అన్నపూర్ణా స్టుడియోస్‌లో షూటింగులే జరుగుతూ ఉంటాయి) తెలుగు చలనచిత్ర పరిశ్రమ తెలుగునాడులో స్థిరపడిపోవడానికి నాంది ఇది.





'బాలనాగమ్మ'లో రామకృష్ణ

ర్పించబడటమే గాక, మొట్టమొదటిసారిగా 'టాక్స్ ఎగ్జెంప్షన్' పొందిన తీర్పు చిత్ర విజయం తెలుగు చిత్రాలలో మంచి 'మార్పు'కు దారి తీస్తుందని ఆశిద్దాం.

## మంచిదినం

మాట కరుకైనా మంచి మనసు గల వాడూ, తెలుగు చిత్ర పరిశ్రమలోని 'ఓల్డ్ గార్డ్స్'లో ఒకరూ అయిన పి. పుల్లయ్య అందరూ బాగుండాలని కోరు కొనే మనిషి. ఆ కోరికను తన దర్శకత్వంలో తయారయిన చిత్రానికి పేరు గానే పెట్టుకున్నారాయన. పద్మశ్రీ పతాకం క్రింద నిర్మించబడిన యీ 'అందరూ బాగుండాలి' చిత్రంలో తారాగణం కొత్త పాతల మేలుకలయికతో ముచ్చటగా వున్నది. సత్యనారాయణ, పద్మనాభం, జగన్నాథ్ (తొలిసారిగా పరి

రామలింగయ్య, రాజబాబు, మమత, సంగీత, కె. విజయలు నటించారీ చిత్రంలో. నిర్మాత: వి. వెంకటేశ్వర్లు.

## నూతన తారల ప్రయోగాలు

చాలామంది నూతన తారలతో నిర్మించబడిన రెండు చిత్రాలు విడుదలకు సిద్ధంగా ఉన్నాయి. వాటిలో ఒకటి పబ్లిసిటీ ఆర్టిస్ట్ ఈశ్వర్ దర్శకత్వంలో నిర్మించబడిన 'అయినవాళ్లు'. ఈ చిత్రంలో హరిబాబు, రమేష్‌బాబు, సుజాత, రత్నాంజలి, సాయిచంద్ర ముఖ్యపాత్రలలో నటించారు. నిర్మాత బోసం ఆంజనేయులు.

## మా యింటి దేవుడు

నూతన తారలతో మరో చిత్రం. చక్రపాణీ మూవీస్ పతాకం క్రింద ఈస్ట్ మన్ కలర్‌లో నిర్మించబడ్డ యీ చిత్రానికి





'బంగారు మనిషి'లో లక్ష్మి, గుమ్మడి

నిర్మాతలు జయరామిరెడ్డి, యాదగిరిరావు. దర్శకత్వం బి. వి. ప్రసాద్. రాఘవన్, హరిబాబు, మిశ్రో, సుబ్బారెడ్డి, బ్రహ్మం, పి. ఎల్. నారాయణ, విజయలలిత, ఫణి, వాణి, విజయభాను ముఖ్య తారాగణం.

## కొత్త చిత్రం

ఫిల్మాలయా కంబైన్స్ సంస్థ నిర్మించే 'స్వర్గానికి నిచ్చెనలు' జనవరి పదిహేనున ప్రారంభోత్సవం జరుపుకొంది. ఎన్. గోపాలకృష్ణ దర్శకత్వంలో 'ఫిల్మాలయా' రామచంద్రన్, పంజు అరుణాచలం నిర్మించే యీ చిత్రంలో రామకృష్ణ, చంద్రమోహన్, జయచిత్ర, ప్రభ మొదలగు వారు నటిస్తున్నారు.

## కలర్లో.... అవుట్‌డోర్లో....

నిర్మాత కోగంటి కుటుంబరావు నిర్మిస్తున్న తాజా చిత్రం పూర్తి అవుట్‌డోర్లో రంగుల్లో చిత్రీకరించబడనున్నది. పూర్తి గ్రామీణ వాతావరణంలో, రసవత్తరమైన కథకు చిత్రరూపం కల్పించబడుతున్న యీ చిత్రానికి దర్శకుడు సి. ఎస్. రావ్. కృష్ణ కథానాయకుడిగా నటిస్తున్న యీ చిత్రానికి తదితర నటీనటుల ఎన్నిక చేసుకొని ఫిబ్రవరిలో చిత్రీకరణ ప్రారంభించే ప్రయత్నాలలో ఉన్నారు నిర్మాత.

## వివాహ బంధానికి నిర్వచనం?

పురుషుడు స్త్రీ మెడలో 'మూడుముళ్లు'



'ఒక దీపం వెలిగింది'లో శుభ

పేసి తన జీవిత భాగస్వామినిగా చేసుకొని, వైవాహిక బంధం వేసుకొనేది హిందూ సాంప్రదాయపు ఆచారం. ఐతే, 'జీవిత భాగస్వామిని' అన్న నిర్వచనానికి న్యాయం కలుగజేస్తోందా ప్రస్తుత సమాజంలోని వైవాహిక సంబంధాలు. ఆడది మగవాడి ఆజ్ఞలకు తల వొంచేదిగానే చూడబడుతోంది గాని 'జీవిత భాగస్వామిని'గా చూడబడటం లేదు. ఈ సమస్యను చర్చిస్తూ, మంచి ఫలితంకోసం మంచివి కాని ఆచారాల్ని ఎదిర్చి నిలబడగలిగిన ఓ స్త్రీని వ్యక్తీకరిస్తూ దర్శకుడు కె. విశ్వనాథ్ 'మాంగళ్యానికి మరో ముడి' పేరిట ఓ చిత్రానికి రూపకల్పన చేస్తున్నారు. కథ, స్క్రీన్‌ప్లే, బాధ్యతలు కూడా దర్శకుడు విశ్వనాథే నిర్వహిస్తున్న యీ చిత్రాన్ని హేరంబ చిత్ర మందిర్ పతాకం క్రింద నాచు శేషగిరిరావు నిర్మిస్తున్నారు.

## 1975 తెలుగు చిత్రాలు!

1975 లో తెలుగు చలనచిత్ర పరిశ్రమను స్థూలంగా పరిశీలిస్తూ, పరిశ్రమలో వస్తూన్న మార్పులను అంచనా వేస్తూ, విడుదలైన చిత్రాలు, వాటి ప్రదర్శనల వివరాలు అందించే 'స్టాటిస్టిక్స్'తో సహా శ్రీ కాట్రగడ్డ నరసయ్య '1975 లో తెలుగు చిత్రాలు' పేరిట ఒక బుక్‌లెట్ ప్రచురించారు. తెలుగు చలనచిత్రసీమ స్థితిగతులను ఎప్పటికప్పుడు సమీక్షిస్తూ, ప్రచురిస్తూ శ్రీ నరసయ్య చేస్తున్న కృషి శ్లాఘనీయం.

## ఇప్పటికా గుర్తింపు?

దశాబ్దంకి పైబడి ఎన్నో చిత్రాలకు స్క్రిప్టు దశనుంచీ దర్శకత్వ నిర్వహణ వరకూ 'సహకారకుడు'గా వుంటూ వచ్చిన అనుభవజ్ఞుడూ, ప్రతిభావంతుడూ సి. వి. రమణకు ('జ్యోతి'లో 'గాంధీగారి రాజ్యంలో గాంధారి కొడుకులు' శీర్షికను నిర్వహిస్తున్న రచయిత వీరే) తాను సృష్టిస్తున్న 'మనిషి రోడ్డున పడ్డాడు' చిత్రానికి దర్శకత్వ భారం అప్పగించాడు హాస్యనటుడు రాజబాబు. ఉత్తమాభిరుచులు గల సి. వి. రమణ ఉత్తమమైన చిత్రాలే తయారు చేయగలరని ఆశించవచ్చు.

—యస్వీనారాయణ

...ed and Published by V. Leelavathy Raghavaiah 40/1, Moosasait Street, Madras-600 017 and Printed by D. Hanumantha Rao, at Kranti Press, 12 Francis Joseph Street, Madras-600 001